*RECAP:* RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHEN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, *A POWERFUL GADGET* WITH *10 POWERS.*

EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: *SHAPE SHIFTER*- GREEN APPLE, *SPEED*-MANGO, *FLIGHT*-ORANGE, *GIANT*-WATERMELON, *STRENGTH*- RASPBERRY, *SHRINK*-LYCHEE, *INVISIBLE*-PINEAPPLE, *STRETCH*-MUSK MELON, *FISSION*-BLACK CURRANT, *FORCE FIELD*-GUAVA.

PARLE®

POPPINS®

Doon Kya?

# Ram and Shyam

# సబ్ – అక్వా వల్డ్

ఈ అద్భుతమైన శక్తిని అన్‌లాక్ చేసే రహస్యం తెలుసుకొనుటకు
http://www.parleproducts.com/brands/parlepoppins
మరియు www.chadamama.com//parle/index.php?pHcId=11

రామ్ మరియు శ్యామ్ అంకుల్‌తో కలిసి అందరూ తమ మొదటి స్కూబ డైవింగ్ సాహసాన్ని చేయడానికి సిద్ధంగా ఉన్నారు.

జాగ్రత్తగా ఉండండి,
ఇక్కడి నుండి మనుషులు మాయం
అవుతారన్న పుకారు ఉంది.

మిస్టర్ పింటోతో డైవ్ చేస్తున్నారు. సముద్రం అలలు పైకి లేచి అల్లకల్లోలమ కావడం మొదలైంది. ఉన్నట్టుండి మునుపెన్నడూ చూడని ఒక పెద్ద జంతువు వారిని పట్టుకుంది.

ఈ జంతువులు వారందరినీ తమ రాజు వద్దకు తీసుకు వెళ్ళాయి.

సుస్వాగతం కొత్త బానిసలారా.
నేను సాండో రాజుని. ఇది మా
సరిహద్దు 'ద సబ్ ఎక్వా వల్డ్.'

రామ్ అండ్ శ్యామ్ చెరసాల పాలయ్యారు మరియు వారందరిచే బలవంతంగా పనులు చేయిస్తున్నారు.

ఈ రారాజులతో మనం
ఎలా బేరాలాడాలి?

వీరంతా అమాయకులైన
ప్రజలని తమ స్వలాభం
కోసం బంధీలుగా చేస్తున్నారు.

ఇక్కపై సాగదు.

ఈ డెకాట్రిక్స్‌ని వాడుతూ, శ్యామ్ గ్రీన్ యాపిల్ ఫ్లేవర్డ్ పాపిన్స్‌ని తిని ఒక పెద్ద మోన్‌స్టర్‌గా మారిపోయాడు.

ఎవరు...
నువ్వు ఎవరు?

నేను ఎక్వా డెమోన్‌ని,
ఈ అమాయక ప్రాణులని విడిచిపెట్టమని
నేను ఆదేశిస్తున్నాను.

శ్యామ్ సాండో రాజుతో పోరాడతాడు మరియు అతని సైన్యం అతని అంతు లేని శక్తికి సాక్ష్యంగా పోరాడుతోంది. వారు గెలిచారు మరియు ప్రతీ ఒక్కరూ విడుదల అయ్యారు.

ధన్యవాదాలు
పాపిన్స్

POPPINS

PARLE®

హే మిత్రులారా! ఫిబ్రవరీ పోటీలో ఆడి ఆనందించారా? ఆనందించారని ఖచ్చితంగా చెప్పగలను. ఎస్ఎమ్ఎస్‌లు మరియు ఈమెయిల్స్‌ల వర్షం మాపై ధారాళంగా కురుస్తోంది. మీ ఆదరణకు మేము ధన్యవాదాలు తెలుపుతున్నాము. మీ ఆశక్తిని పెంచడానికి, మేము కన్‌సోలేషన్ ప్రైజులని ముందుగా ప్రోమీస్ చేసిన దానికంటే మూడు రెట్లు ఎక్కువ చేసాము. ఈ క్రింది వారు ముగ్గురు లక్కీ విజేతలు, వీరు నింటెండో వి, ఏసర్ లాప్‌టాప్ మరియు యాపిల్ ఐపాడ్‌లని గెలుచుకున్నారు. కన్‌సోలేషన్ ప్రైజులని మా వెబ్‌సైట్ www.parleproducts.com లో ఉంచబడ్డాయి. చూడండి.

1st సచిన్ గుప్త

2nd స్వాతి కె హృషి

3rd షాజి మోన్ ఎమ్‌పి

మీ చిన్నారుల పొదుపు
ఈ ఆషాడం నుండి ఆరంభం కానివ్వండి...









sreshta

*Conditions apply

ఆషాడం తగ్గింపులో పొదుపు చేసే మొత్తాన్ని
మీ పిల్లలు ఆదా చేయడానికి హుండీ ఉచితం

మీ పిల్లలకు పొదుపు చేసే అలవాటుని నేర్పాలనే కుతూహలం లేని తల్లితండ్రులు వుంటారా?

పోతీస్ వస్త్రాలయంలో ఈ ఆషాడంలో వస్త్రాలు ఎంచుకునేటప్పుడు వినియోగదారులు శ్రేష్ఠమైన రకాలని మాత్రమే కాకుండా తగ్గింపు ద్వారా ఆదాని కూడా పొందుతారు. ఈ ఆదాచేసే డబ్బుని మీ పిల్లల చేతికి ఇచ్చి పొదుపు చేయమనడం ద్వారా పిల్లలకి పొదుపు చేసే అలవాటు నేర్చుకుంటారు.

పొదుపుచేయడానికి అవసరమయ్యే హుండీని పోతీస్ వస్త్రాలయం ఒక్కొక్క వినియోగదారునికి హుండీని ఉచితంగా అందిస్తుంది. ఆషాడానికి పోతీస్‌ని ఎంపికచేసుకోండి శ్రేష్ఠమైన వస్త్రాలని కొని ఆదా చేసిన తగ్గింపు డబ్బుని మీ పిల్లల చేతికి ఇచ్చి వారికి పొదుపు చేసే అలవాటుని నేర్పించండి



పోతీస్®
అందమైన వస్త్రాల ఆలయం

Usman Road, Panagal Park, T. Nagar, Chennai - 17.
Ph: 044 - 2431 0901. Basement Car Parking
Srivilliputhur I Tirunelveli I Madurai I Coimbatore
Online Shopping at www.pothys.com

# ఈ సంచికలో...



చందమామ Volume-2 August 2011 Issue-08













**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.



T

# వానమేఘాల రాక

యథావిధిగా, ప్రతి సంవత్సరం మనం ఆగస్ట్ 15న స్వాతంత్ర్య దినోత్సవాన్ని జరుపుకుంటూనే ఉన్నాము. ఈ ఏడు కూడా మనం స్వతంత్ర దినానికి సిద్ధమవుతుండగా వాన మేఘాలు దేశంలోకి ప్రవేశించాయి. అయితే ఉగ్రవాద దాడుల నుంచి దేశం సురక్షిత స్థితిలో ఉందనే సంతృప్తిని మన పౌరులలో కల్గించడంలో ఇప్పటికీ మనం వెనుకబడే ఉన్నాం. పైగా, అవినీతిని నిరోధించడానికి, నిర్మూలించడానికి ప్రయత్నాలను చేపట్టలేని వాతావరణాన్ని మన రాజకీయ ప్రతినిధులు సృష్టించడం కూడా మనం చూశాము.

దేశ నైతిక చట్రం దారుణంగా బలహీనపడిపోయింది. కొద్ది సంవత్సరాల క్రితం వరకు అల్పంగా, హీనమైనవిగా భావించబడిన అంశాలు ఇప్పుడు మన జీవితాల్లో ఓ భాగమైపోయాయి. ఈ నెలలోనే మనం రక్షాబంధన్ జరుపుకుంటున్నాము. ఇది సోదరికి సోదరుడు రక్షణకల్పించడానికి ప్రతీకగా నిలిచే పండుగ. కాని ప్రతి రోజూ మనం పత్రికలలో అత్యాచార కేసులను చదువుతూనే ఉన్నాము.

ఈ సమస్యలపై తగిన వైఖరిని అవలంబించడమే కాకుండా మనకు చేతనైన రీతిలో చర్యలు చేపట్టవలసిన తరుణం ఆసన్నమయింది. ఇది మన సమాజాన్ని బలోపేతం చేసి సముచిత స్థానంలో నిలబెడుతుంది. మన ఇరుగు పొరుగున ఉన్నవారిని మెరుగు పర్చడానికి కూడా రాబోయే కాలంలో కొన్ని నిర్దిష్ట చర్యలను చేపట్టాలని తీర్మానించుకుందాము.

పదే పదే చెబుతున్నట్లుగా, మన దేశానికి ఉజ్వల భవిష్యత్తు ఉంది కాని దాన్ని ఎంత ప్రకాశవంతం చేస్తామనేది మన మీదే ఆధారపడి ఉంది. ఆ దిశగా బుడిబుడి అడుగు లేద్దాము రండి....

– సంపాదకులు





ఆగస్ట్ 2011 ₹20/-

*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**Content Head - Online :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar




# పాఠకుల లేఖలు



తాజా చందమామ సంచిక అందింది. చాలా ఏళ్ల తర్వాత మళ్లీ పాత చందమామను తలపించింది. ఫలానా కథ బాగుంది, బాగులేదు అని చెప్పలేనట్లుగా అన్ని కథలూ మురిపించాయి. పాత కథలూ, కొత్త కథలూ నిజంగా పోటీ పడ్డాయి. ఒక్కో కథా చదువుతూ మహదానందపడ్డాను. దశాబ్దాలుగా చందమామను చదువుతున్న కుటుంబం మాది. పాత చందమామను మాకందించినందుకు కృతజ్ఞతలు. – జి. శ్రీనివాస్, హైదరాబాద్

చందమామతో నాది యాభై ఏళ్ళ అనుబంధం. మే నెల చందమామలో కథల వాసి బాగుంది. రాసి పెరిగింది. చందమామ పుటలు నున్నగా, ఆయిల్ ప్రింట్‌తో ఉండాలని పాఠకులు కోరడం లేదు. కథ చిన్నదైనా చదవగానే మనసుకు హాయిని కలిగించి, మంచి కథ చదివాం అన్న అనుభూతి మాకు కావాలి.

– బి. సత్యనారాయణ, నిజామాబాద్

పర్యావరణ కథల వస్తువు మంచిదే కాని, కథను సమర్పించే తీరును మెరుగు చేయవచ్చు. పిల్లలకు మరీ పాఠంలా, తెచ్చి పెట్టిన సన్నివేశాల్లా కాకుండా విసుగు కల్గించకుండా కథ చెబితే మంచిది. బొమ్మల ముద్రణ నాణ్యతపై పాఠకుల అభిప్రాయాన్ని చందమామ యాజమాన్యం గౌరవిస్తుందని ఆశిస్తున్నాను.

– జి.లలిత, అమెరికా

'చందమామ ఆర్ట్‌బుక్'లో వపా, శంకర్, చిత్ర, ఎంటీవీ ఆచార్య గార్ల చిత్రాలు కంటికి అందంగా, మధురానుభూతిని మిగిల్చాయి! నాటి చందమామ చిత్రాలను చక్కటి ముద్రణతో అందంగా అందించిన ఈ ప్రయోగం చిత్రాభిమానులకు అపురూపమైన కానుక! జీవిత కాలం పదిలంగా దాచుకోవాల్సిన అమూల్యమైన సంపద! శంకర్ గారు వేసిన ఖాండవ దహనం ప్రజ్వలిస్తున్న అగ్నికీలల వేడిమిని తలపించింది. అచార్య గారు వేసిన, 'వెన్నెలలో గోపికలతో కృష్ణుడి రాసక్రీడలు' చిత్రం విజయా వారి వెన్నెలను కళ్ళముందు ఆవిష్కరించింది! వ.పా.గారి ఏకలవ్యుడు చిత్రంలో ద్రోణాచార్య పోలికలతో రూపొందిన శిల్పం పోలిక ఒకేలా ఉన్నా మనిషికి, శిల్పానికి తేడాను చూపిన తీరు అద్భుతం! యువ దీపావళి ప్రత్యేక సంచికలలోని వ.పా.గారి చిత్రాలు కూడా అందించగలరు. – పి. శ్రీరామచంద్రమూర్తి, తెనాలి

# మూగజీవుల కృతజ్ఞత

ఒకరోజు మల్లన్న ఎరువులు కొనడానికి చీకటితోనే పట్నానికి బయల్దేరాడు. అవ్వ బుజ్జమ్మ ఒక మూటలో చద్ది అన్నం కట్టించి, 'ఏదీ నీవు ఒక్కడివే తినకు. ఎవరికైనా కొంతపెట్టి తిను, ఎవ్వరూ లేనప్పుడు కనీసం ఏ జంతువుకో, చీమకో ఐనా సరే కాస్తంత వేసి తిను'. అని చెప్పి పంపింది.

మల్లన్న త్వర త్వరగా బండి తోలుకుని వెళ్ళి పట్నంలో ఎరువులు కొని, తిరుగు ప్రయాణమయ్యాడు. మధ్యలో చిన్న చిట్టడవి మధ్యలో పారుతున్న నదిని సమీపించగానే మల్లన్న కడుపులో ఎలకలు పరుగెత్తసాగాయి. బండిని నిలిపి, ఎద్దులకు గడ్డి వేసి, తానూ కూర్చుని అవ్వ ఇచ్చిన చద్ది మూట విప్పాడు. 'ఎవరికైనా కాస్తంతైనా పెట్టి తినమని' అవ్వ చెప్పిన మాటలు గుర్తు వచ్చాయి. చుట్టూ చూశాడు, ఎవ్వరూ కానరాలేదు. వాడికి చెట్టు సమీపంలో వున్న ఒక చీమల పుట్ట కనిపించింది. మల్లన్న కొంత అన్నం, కాసింత కారప్పూస తీసి ఆ పుట్ట వద్ద ఉన్న ఓ ఆకుమీద పెట్టాడు, కొంత అన్నం పక్కన ఉన్న ఓ రాతిపై వుంచాడు. మిగిలింది తాను తిని, నీరు తాగి చెట్టు నీడన నడుంవాల్చాడు. ఆ రాతి మీది అన్నం చూసిన కొన్ని కోతులు వచ్చి, తిని చెట్టు కొమ్మలపై కూర్చున్నాయి. పుట్టవద్ద వుంచిన అన్నాన్ని, కాకులు 'కావు కావు' మని తమ మిత్రులను పిలిచి తినడం, కొన్ని మెతుకులను చీమలు నోట కరుచుకు వెళ్లడం, అంతా గమనిస్తూ మెల్లిగా నిద్రలోకి జారుకున్నాడు మల్లన్న.

ఉన్నట్లుండి మెలకువ వచ్చి చూడగా పుట్ట వద్ద వున్న నల్లత్రాచును పొడుస్తున్న కాకులు, చుట్టుముట్టి కుడుతున్న చీమలగుంపులు, పోరాడుతున్న కోతులు కనిపించాయి. తోటి ప్రాణులకు కొంత అన్నం పెట్టడం వల్ల కృతజ్ఞతతో, 'ఆ నోరు లేని మూగజీవులు' ఈ రోజు తన ప్రాణాన్ని ఎలా కాపాడాయో చూసి ఆశ్చర్యం, ఆనందం కలిగింది. 'నోరులేని ప్రాణులే ఇంత సాయం చేయగా, నోరు, వివేకం, విచక్షణా జ్ఞానం ఉన్న మానవులు ఒకరి కొకరు తప్పక సాయం చేసుకు తీరాల్సించే! తన అవ్వ చెప్పిన చిన్న మాటలో ఎంత అంతరార్థం దాగి ఉందో!' అనుకుంటూ మల్లన్న తన అవ్వకు విషయం చెప్పడానికి త్వర త్వరగా బండితోలుకుని వెళ్లసాగాడు. – ఆదూరి హైమవతి



# చందమామతో నా జ్ఞాపకాలు - 1

అది 1952-53 కాలం. నేను ఏడవ తరగతి చదువుతున్నాను. చందమామను మొదటిసారిగా అప్పుడే చూశాను. ఇతర పిల్లల పత్రికలకు భిన్నంగా, సుందరమైన సాంప్రదాయిక కథలు, అద్భుతమైన చిత్రాలు నన్ను ఆకట్టుకున్నాయి. అప్పటి నుంచి ప్రతినెలా నేను చందమామను కొంటూ వచ్చాను. తర్వాత అది అలవాటుగా మారిపోయింది. సంస్థాపకులుగా బి.నాగిరెడ్డి, సంపాదకులుగా చక్రపాణి ఉంటూవచ్చిన కాలమది. అప్పట్లోనే విచిత్రకవలలు సీరియల్ ముద్రించబడింది.

ఇప్పుడు నా వయస్సు 70 ఏళ్లు. ఇప్పటికీ చందమామను అదే ఆసక్తితో ప్రతి నెలా కొని చదువుతున్నాను. ఆరోజుల్లో చిత్రా, శంకర్ బొమ్మలు బాగా ఆకట్టుకునేవి. చందమామ కథకు మల్లే ఈ చిత్రాలు కూడా ప్రాముఖ్యత సంతరించుకునేవి. ఏ ఇతర పత్రికలలో అయినా ఇంతటి రమణీయ చిత్రాలు ఉండేవా? కథ నడకను ఈ బొమ్మలు సజీవంగా ఉంచేవి!



Name: Chandramohan Pradhan
Occupation : G.D.Art,
Patna Art College, Bihar.

నేను కూడా చిన్నప్పటినుంచి చిత్రకారుడిగా ఉన్నాను. పాట్నా ఆర్ట్ కాలేజి నుంచి ఆర్ట్‌లో ప్రభుత్వ డిప్లొమా తీసుకున్నాను. హిందీలో ప్రస్తుతం కథా రచయితగా నాకు పేరు ప్రఖ్యాతులు ఉన్నాయి కాని ఈనాటికీ చందమామ అంటే నాకెంతో ఇష్టం.

గత కొంతకాలంగా కార్టూన్స్, జానపద కథలు చందమామలో ఎక్కువగా ముద్రించబడేవి. ఇవి చందమామ రూపురేఖలను మార్చాయి. కాని మళ్లీ ఇప్పుడు కథలకు ప్రాధాన్యత ఇస్తున్నారు. కథల సంఖ్య కూడా పెరిగింది. ఇది స్వాగతించవలసిన విషయం.

గతంలో నా కుమారుడు చందమామ పత్రికను చదివేవాడు. తనకు ఇప్పుడొక కుమారుడున్నాడు. తాను ముంబైలో ఉంటున్నాడు. నా మనవడికి వీడియో గేమ్స్ అంటే చాలా ఇష్టం. అయితే నాకు ఎప్పుడు అవకాశం వచ్చినా, చందమామను అతడికి బహుమతిగా పంపడం మానలేదు.

దయచేసి చందమామను పాత సైజులో ముద్రించండి. ప్రస్తుత సైజులో పత్రిక చిన్నదిగా ఉంది.

బాల్యంలో నేను భద్రపర్చిన తొలి చందమామ ప్రతులు నా వద్ద ఉన్నాయి. వాటిని తిరగేస్తున్నప్పుడు తొలినాటి సంతోషానుభూతిని ఇప్పటికీ అనుభవిస్తుంటాను. మొదట్లో సీరియల్స్ మాత్రమే రంగుల్లో ఉండేవి. చిత్రాలు కూడా సాదారంగులో ఉండేవి. కాని అవి అద్భుత సౌందర్యంతో అలరారేవి. చందమామలో బొమ్మలకు మరింత ప్రాధాన్యత ఇవ్వండి. బొమ్మలు కథకు ప్రాణ ప్రతిష్ట చేస్తాయి.

Request to readers: Contributors of stories, memories are requested to send in their entries with their complete name, address, phone no and other contact details to enable us to get back to you.
Write to us: Chandamama India Ltd., No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street, Vadapalani, Chennai-600026. ● Phone: 044-43992828 ● Email : online@chandamama.com

# చందమామతో నా జ్ఞాపకాలు - 2

నా వయస్సు 66 సంవత్సరాలు. గత 55 ఏళ్లుగా నేను చందమామ పత్రికను చదువుతూ వస్తున్నాను. 1955 వరకు మేము ఒక చిన్న గ్రామంలో ఉండేవాళ్లం. మా నాన్న గ్రామస్థాయి రెవెన్యూ అధికారి. మా చిన్నప్పుడు చందమామ పత్రికకోసం ఎంతగా వెంపర్లాడేవాళ్లమంటే, చందమామ ఎప్పుడొస్తుంది అని ప్రతినెలా పోస్టాఫీసుకు వెళ్లి వాకబు చేసేవాళ్లం. పోస్టాఫీసుకు చందమామ వచ్చినప్పుడు అక్కడ పనిచేసే ఉద్యోగులు దాన్ని తీసుకుని చదివేవారు. రెండు, మూడు రోజుల తర్వాత దాన్ని తిరిగి కవర్‌లో పెట్టి దాన్ని మాకు పంపేవారు. చందమామ పత్రిక తిరగేస్తున్నప్పుడు లోపలి కాగితాలు నలిగినట్లు, మరకలు అంటినట్లు మాకనిపించేది. దాంతో ఇది పోస్టాఫీసు వారి పనే అని అర్థమయ్యేది. దీన్ని బట్టి చూస్తే ఈ రోజుల్లో మాదిరే అప్పట్లో కూడా చందమామ అందరినీ ఆకర్షించేది.



Name : A.K. Dhumal
Occupation : Revnenue Officer, Maharashtra.

పిల్లలందరమూ చందమామను చదవడానికి ఎంత పోటీ పడేవారమంటే, ముందు నేను చదువుతానంటే కాదు నేను అంటూ మేం ఒకరికొకరం పోట్లాడుకునేవాళ్లం. నాకు చిత్ర లేఖనం అంటే చాలా ఇష్టం. అందుకే చందమామ బొమ్మలను బాగా ఇష్టపడేవాడిని. చందమామ బొమ్మలను పదే పదే పరిశీలిస్తూ వాటిని అలాగే గీయాలని ప్రయత్నించేవాడిని కాని నాకు సాధ్యమయ్యేది కాదు. ఎందుకంటే చందమామ బొమ్మలు చిన్నవిగానే ఉండేవి కాని అవి చాలా వివరాలతో ఉండటంతో దృశ్యాలను యధాతథంగా చిత్రించడం కష్టమయ్యేది. చందమామ కథలకు జోడించిన బొమ్మలు శక్తివంతమైన వ్యక్తీకరణకు నిదర్శనాలు. అందుకే చందమామ కథలను అంత సులువుగా మేం అర్థం చేసుకునేవాళ్లం. చందమామ బొమ్మలను మీరెంత నిశితంగా పరిశీలించినప్పటికీ మీకు వాటిలో ఒక తప్పు కూడా కనబడదు. అదే చందమామ బొమ్మల గొప్పతనం.

ఇన్నేళ్ళ తరవాత కూడా కొత్త చందమామ కోసం నేను వాకబుచేస్తూనే ఉంటాను. చందమామ సైజు తగ్గించబడింది కాని దాని కథల మాధుర్యం ఇప్పటికీ అలాగే ఉంది. నా మిత్రులు చాలామంది నేను చందమామను ఇప్పటికీ చదువుతుండటం చూసి ఆటపట్టిస్తుంటారు. 'చందమామను ఒకసారి చదవండి. తర్వాత దాన్ని వదలరు' అని నేను సమాధానమిస్తుంటాను. ప్రపంచంలో చాలా పుస్తకాలు, సంచికలు ఉండవచ్చు కాని చందమామ కలిగించే ఆకర్షణ నిజంగా విశిష్టమైనది.

నిజం చెప్పాలంటే చందమామ రూపకర్తలకు మాటల్లో కృతజ్ఞతలు చెప్పడం కష్టసాధ్యం. చందమామ ఒక అమూల్య బహుమతి. అది కథల నిధి.

బేతాళ కథలు

# ధర్మయ్య తీర్పు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగానే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా! నువ్వు ఈ అర్ధరాత్రివేళ ఏ ప్రయోజనం ఆశించి ఇలా సంచరిస్తున్నావో నాకు బోధపడటంలేదు లక్ష్యం లేని గమ్యం, విచక్షణ లేని వృత్తిధర్మం వ్యక్తికీ, లోకానికి కూడా మంచిని కలిగించవని నీకు తెలిసే ఉంటుంది. మరీ ముఖ్యంగా, సమాజానికి దిశానిర్దేశం చేసే వ్యక్తికి ఎంతో విచక్షణ ఉండాలి. అలాంటి విచక్షణతో అద్భుతమైన తీర్పు చెప్పిన గ్రామపెద్ద ధర్మయ్య కథ చెబుతాను శ్రమ తెలియకుండా విను' అంటూ ఇలా చెప్పసాగాడు.

రామాపురం గ్రామంలో రంగనాథం అనే వడ్డీ వ్యాపారి ఉండేవాడు. వ్యాపారం దగ్గర చాలా ఖచ్చితంగా ఉంటాడు రంగనాథం.



ఇస్తానన్న సమయానికి డబ్బు ఇస్తాడు. వీలు కాకపోతే ఆ విషయం ముందే చెప్పి, వేరే ప్రయత్నాలు చేసుకోమని చెబుతాడు. ఇవ్వడం ఇష్టం లేని పక్షంలో నిక్కచ్చిగా ఆ విషయం చెబుతాడు తప్ప చాలామంది వడ్డీ వ్యాపారుల్లా కుంటిసాకులు చెబుతూ కాలయాపన చెయ్యడు.

వసూలు విషయంలో కూడా అంతే నిక్కచ్చిగా ఉంటాడు రంగనాథం. నెల కాగానే వడ్డీ ఇచ్చేయాలి అసలు కూడా అంతే. ఇస్తానన్న సమయానికి ఇచ్చెయ్యాలి. కావాలంటే పాత అప్పు తీర్చి, మళ్లీ తీసుకోవాలి తప్ప, వాయిదా మాత్రం ఒప్పుకోడు. అప్పు ఇచ్చేటప్పుడే అవతలి వారి తీర్చే స్థోమత, ఆస్థిపాస్తులు అన్నీ పరిగణనలోకి తీసుకునే ఇస్తాడు గనుక, గడువు నాటికి అసలు, వడ్డీ అన్నీ జమ కాకపోతే, వాటికి సరిపడా అవతలివారి స్థిర చరాస్థులు తన స్వాధీనంలోకి తీసేసుకుంటాడు.

అలాంటి రంగనాథం దగ్గరికి అప్పు కోసం వచ్చాడు రామయ్య అనే రైతు.

'రంగనాథం గారూ, ఇప్పుడు పంటలు వేసే రోజులు. దుక్కి దున్నాలి, నారు పోయాలి, నీరుపెట్టాలి. ఈ మధ్యన వర్షాభావ పరిస్థితుల కారణంగా పంటలు సరిగా పండలేదు. దాంతో చేతిలో చిల్లిగవ్వ లేకుండా పోయింది. కనుక మీరు కొంత డబ్బు అప్పుగా ఇస్తే కోతలమ్మే సరికి మీ డబ్బు మీకు వడ్డీతో సహా ఇచ్చేస్తాను' అన్నాడు రామయ్య.

'రామయ్యా.. నా దగ్గర కూడా ఇప్పుడు ధనం స్థిరంగా లేదు. అంతా ప్రజలమీద ఉండిపోయింది. అయినా నువ్వెప్పుడూ నోరు తెరిచి అడగని వాడివి కనుక ఒక పని చేస్తాను. నీకు అవసరమైనప్పుడల్లా డబ్బు సర్దుబాటు చేస్తాను. పంట చేతికి వచ్చాక మొత్తం సొమ్ము వడ్డీతో సహా ఇద్దువు గాని' అన్నాడు రంగనాథం.

'చిత్తం. తమ దయ' అన్నాడు రామయ్య.

'మరో విషయం.... అవసరానికి అప్పు తీసుకునేటప్పుడు అప్పిచ్చువాడు దేవుడిలా కనిపిస్తాడు. వసూలుకు వచ్చినప్పుడు మాత్రం రాక్షసుడిలా కనిపిస్తాడు. అంత్యనిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలు కదా. అందుకే చెబుతున్నాను. పంట చేతికి వచ్చాక అసలు, వడ్డీ మొత్తం జమ చేయక

పోతే దానికిసరిపడా పంట తీసుకునేహక్కు నాకుంటుంది' అన్నాడు రంగనాథం.

అతడి అన్ని షరతులకీ ఒప్పుకున్నాడు రామయ్య. దుక్కి దున్నేటప్పుడు కొంతా, విత్తనాలు కొనేందుకు కొంతా, ఆకు తీత సమయంలో కొంతా, ఊడ్పుల సమయంలో కొంతా, కలుపు తీసేటప్పుడు కొంతా, ఎరువు చల్లేటప్పుడు కొంతా మధ్య మధ్యలో రకరకాల పనుల నిమిత్తం కూలీలకి ఇవ్వడానికి కొంతా దపదఫాలుగా సొమ్ము ఇచ్చాడు రంగనాథం.

ఆ ఏడాది కూడా ప్రకృతి అనుకూలించక దిగుబడి పెద్దగా రాలేదు.

పొలం మీద ఉండగానే పంట ఎంత చేతికి వస్తుందో తెలుస్తుంది రైతుకి.

దిగుబడి తక్కువ వస్తుందని తెలిసినంత మాత్రాన పంట కొయ్యకుండా ఏ రైతూ వదిలెయ్యడు. అసలేమీ రాకపోయినా సరే పశుగ్రాసానికైనా పనికొస్తుందని కోయిస్తాడు.

కోతల సమయంలో కూడా రంగనాథం దగ్గరకు వెళ్లడం తప్పలేదు రామయ్యకి.

కోసిన పంటని కట్టలు కట్టడానికి మోపులెత్తడానికి, ధాన్యం నూర్చడానికి, కూలీలకు అవసరమైన కూలీ కోసం కూడా అతను రంగనాథం వద్దే అప్పు తీసుకున్నాడు.

తాలు ధాన్యాన్ని ఎగరబోసి మేలు ధాన్యాన్ని రాశిగా చేసేనాటికి అప్పు తీర్చమంటూ వచ్చి కూర్చున్నాడు రంగనాథం.

'అయ్యా... రంగనాథం గారు... పరిస్థితి చూశారు కదా. అనుకున్న దానిలో సగం కూడా రాలేదు. ఈసారికి కాస్త కనికరించండి. ధాన్యం అమ్మి, అసలుకు సగం,





ఇప్పటి వరకూ అయిన వడ్డీ జమ కడతాను. మిగతాది వచ్చే పంట కాలానికి తీర్చేస్తాను', అంటూ బతిమాలాడు రామయ్య.

ససేమిరా కుదరదంటూ కూర్చున్నాడు రంగనాథం. రామయ్య ఎంత బతిమాలినా అతను వినలేదు, కరగలేదు.

'ఈ ధాన్యం మొత్తం అమ్మినా నా బాకీ తీరదు. కనుక దీన్ని నేనే తీసుకెళ్తున్నాను. దీనికి ధర నిర్ణయించి నీ బాకీ చెల్లిపోగా, ఇంకా ఎంత ఉందో చీటీ పంపిస్తాను', అంటూ ధాన్యాన్ని బస్తాల్లో నింపి బండికె క్కించి తీసుకుపోయాడు రంగనాథం.

'ఉన్నదంతా మీరే తీసుకుపోతే మాకు తిండి ఎలాగయ్యా... కాస్త దయచూపం డయ్యా', అని రామయ్య ఎంత మొత్తు కున్నా రంగనాథం చెవికెక్కించుకోలేదు.

ఏం చేయాలో పాలుపోని రామయ్య చుట్టుపక్కల వారి సలహాపై ఈ విషయం గురించి గ్రామపెద్ద ధర్మయ్యకి ఫిర్యాదు చేశాడు.

ధర్మయ్యకి ఆ ఊళ్లోనే కాదు, చుట్టు పక్కల కూడా పెద్ద పేరుంది.

ధర్మయ్య తీర్పంటే అందరికీ వేద వాక్కు. అలాంటి ధర్మయ్య నుండి పిలుపు రాగానే ఉన్నఫళాన ఆయనముందు హాజ రయ్యాడు రంగనాథం.

'ఆరుగాలం కష్టపడి తను పండించు కున్న మొత్తం పంటని మీరు అక్రమంగా తరలించుకు పోయారని ఈ రామయ్య మీమీద ఫిర్యాదు చేశాడు. దానికి మీ సంజాయిషీ ఏమిటి?' అడిగాడు ధర్మయ్య రంగనాధాన్ని.

'అయ్యా, నా వృత్తి వడ్డీ వ్యాపారం. అసలు, వడ్డీ నిక్కచ్చిగా తీసుకోవడం నా వృత్తి ధర్మం. తమకి తెలియనిది కాదు. అప్పు తీసుకున్నోళ్ల పరిస్థితులమీద జాలి పడుతూ కూర్చుంటే, ఆ తరవాత నామీద జాలిపడేవారుండరు.

ఇక ఈ రామయ్య విషయమంటారా? అప్పు ఇచ్చేటప్పుడు అతను ఒప్పుకున్న షరతుల ప్రకారమే నేను ధాన్యాన్ని తీసుకు పోయాను. అదీకాక ఈ పంటకు సంబం ధించి విత్తనాల దగ్గరనుంచి ఎగరబోత వరకు ప్రతిపైసా నేను పెట్టిందే. ఆ రకంగా చూసినా పంట మొత్తం నేను తీసుకోవ డంలో అన్యాయమేమీ లేదు. ఆ పైన తమ ఇష్టం. మీరిచ్చే తీర్పు ఎలాంటిదైనా దానికి

కట్టుబడి ఉంటాను’ అన్నాడు రంగనాథం. రంగనాథం వాదన విన్న ధర్మయ్య కాసేపు ఆలోచనలో పడ్డాడు. తర్వాత తన తీర్పు వినిపించాడు.

‘ఇరువైపులా వాదనలు విన్న తర్వాత, ఇరుపక్షాలకీ న్యాయం జరిగేలా నేనో నిర్ణయానికొచ్చాను. రామయ్య పంట మొత్తంలో రంగనాథం మూడొంతులు బాకీ కింద జమ చేసుకుని ఒక వంతు అతడి ఇంటికి పంపించాలి. మిగతా బాకీ తర్వాతి పంట కాలంలో తీసుకోవాలి.

అంతే కాదు. తర్వాతి పంట కాలంలో రామయ్యకి అవసరమైన ధనం రంగనాథమే సమకూర్చాలి. దాన్ని కూడా వడ్డీతో సహా ఆ పంట కాలంలో వసూలు చేసుకోవాలి. అప్పుడు కూడా కాలం అనుకూలించకపోతే ఆ తర్వాతి పంటకాలంలో.. ఇలా రామయ్యకి ఎప్పుడు అనుకూలమైతే అప్పుడు వసూలు చేసుకోవాలి. రంగనాథమే కాదు.

ఇక నుంచి ఏ వడ్డీవ్యాపారి అయినా సరే రైతులకి తక్కువ వడ్డీకి రుణాలివ్వాలి. వీలును బట్టి వసూలు చేసుకోవాలి’.

అక్కడిదాకా కథ చెప్పిన శవంలోని బేతాళుడు ‘రాజా! ధర్మయ్య తీర్పు సమంజసంగా ఉందా? సరియైన తీర్పులకు పెట్టింది పేరయిన ధర్మయ్య ఈ విషయంలో అలాంటి తీర్పు ఎలా చెప్పాడు? అప్పిచ్చి వసూలు చేసుకోవడమే రంగనాథం తప్పయిందా? దానికే అతనికి అలాంటి శిక్ష విధించబడిందా? ఈ ప్రశ్నలకి సరైన సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీ తల వెయ్యి ముక్కలైపోతుంది’ అన్నాడు.



అప్పుడు విక్రమార్కుడు ‘స్థూల దృష్టితో చూస్తే రంగనాథం చెప్పింది సరైనదే అనిపిస్తుంది. దాంతో ధర్మయ్య తీర్పు తప్పనిపిస్తుంది. కానీ, సూక్ష్మదృష్టితో చూస్తే ధర్మయ్య తీర్పులోని విచక్షణ అర్థమవుతుంది. సమాజానికి దిశా నిర్దేశం చేసే వ్యక్తులకి ఆ సూక్ష్మ దృష్టి చాలా అవసరం. మరీ ముఖ్యంగా న్యాయం చెప్పే స్థానంలో ఉన్నవాళ్లకి. దేశ కాలమాన పరిస్థితుల బట్టి తీర్పు ఉండాలి. అది భవిష్యత్తులో రాబోయే తగాదాలకి, భావితరాలకి మార్గదర్శకమవ్వాలి. ధర్మయ్య తీర్పు అలాంటి లక్ష్యం కలది. ఈ తగాదా విషయంలో రామయ్యని మామూలు అప్పు తీసుకున్న

వ్యక్తిలా చూడకూడదు. ఎందుకంటే అతనో రైతు. ప్రపంచం మొత్తానికి అన్నం పెట్టే రైతు. దేశానికి వెన్నెముక అయిన రైతు. అలాంటి రైతుకి వ్యవసాయమంటే ఆసక్తి ఉండాలే గానీ విరక్తి ఉండకూడదు. అలా జరిగిన నాడు ప్రపంచం తిరగబడి పోతుంది. వాస్తవానికి కష్టించి పండించే రైతొక్కడే నిజం. మిగతా ప్రపంచమంతా భ్రమ. ప్రాథమికంగా తిండి అంటూ లేక పోతే సమాజం కుప్పకూలిపోతుంది. దేశాన్నేలే రాజైనా పండించేవాడి కళ్లం దగ్గర బిచ్చగాడిలా కూర్చోవాల్సి వస్తుంది. ఇదంతా ఆలోచించే అలాంటి తీర్పు చెప్పాడు ధర్మయ్య.

రంగనాథం అన్నట్టు నారు పోసే దగ్గర్నుంచి కోత కోసే వరకు ప్రతి పైసా అతను పెట్టిందే అయినా ఆ పంటలో రామయ్య వాటా కూడా ఉంది. అది అతని కష్టం. కేవలం డబ్బు నాటితే పంట పండదు కదా. దాంతో పాటు ఆ నేలని వ్యవసాయ యోగ్యంగా చేసిన రామయ్య పూర్వీకుల కష్టం కూడా ఆ పంటలో ఉంది. విత్తనాలు తీసుకెళ్లి మైదానంలో చల్లి ఎంత కష్టపడినా పండవు కదా. తను ఎంత కష్టపడి పండించిన పంటైనా ఏ ప్రకృతి వైపరీత్యం వల్లో నోటి దగ్గరికి రాకపోతే అది సహజమే అని సరిపెట్టుకుంటాడు రైతు. కానీ సాటి మనిషికి కనికరం లేక పంట చేతికందలేదంటే మాత్రం వ్యవసాయం మీద విరక్తి పెంచుకుంటాడు. అది చాలా ప్రమాదం. ప్రపంచానికి అరిష్టం.

అందుకే రామయ్య జీవికకి అవసరమైన పంటని అతనింటికి పంపమనీ, తర్వాత అవసరాలకి డబ్బు ఇవ్వమనీ, అతనికి వీలున్నప్పుడే వసూలు చేసుకొమ్మని ఇలాగే అందరు వ్యాపారులూ అందరు రైతులకూ ఇవ్వాలని తీర్పు చెప్పాడు ధర్మయ్య' అన్నాడు.

రాజుకి ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. *(కల్పితం)*

**(ఆధారం : వెంకటేష్)**






# కురుందేవి

ఆరావళి కొండలలో అండ్వా అనే అడవి. ఆ అడవిలో ఒక పల్లె. ఆ పల్లెకు సమీపంలో ఒక జొన్న చేను. ఆ చేనిలో మంచె పైన కూర్చుని ఉన్న ఒక పద్దెనిమిదేళ్ల బాలాకుమార్తె పిట్టలను తోలుతూ ఉంది.

కేకలు వేసుకుంటూ పరుగెత్తి వస్తున్న మనుష్యుల కోలాహలం వినిపించింది. ఏమిటి చెప్మా? అనుకుంటూ ఆమె మంచెపై నిలబడి చూసింది. ఆమె చూస్తూ ఉండగానే పెద్ద అడవిపంది ఒకటి ప్రాణ భీతితో పరుగెత్తివచ్చి గుబురుగా ఉన్న ఆ జొన్నచేనిలో దూరి దాగుకొన్నది. దానిని తరుముకుంటూ వచ్చిన వాళ్లూ వారిని వెంటబెట్టుకు వచ్చిన రాజకుమారుడూ చేను దాకా వచ్చి ఆగి, పందిని బయటకు రప్పించటం ఎలాగా అని ఆలోచనలో పడ్డారు. అప్పుడు మంచెపైనున్న కన్య, 'పందికోసమా చూస్తున్నారు?' అంది. 'ఔను' అన్నారు వాళ్లు. చివర పదునుగా చెక్కిన ఒక కర్రను పెరికి దానితో ఆమె పందిని ఆయువుపట్టున ఒక్కపోటు పొడిచేసరికి అది గిలగిలా తన్నుకుని చచ్చిపోయింది. అప్పుడామె దాని తోక పట్టుకుని బరబరా చేలోంచి ఈడ్చి తెచ్చి, రాజకుమారుని ముందు పడవేసింది.

వేటలో తాము చంపదలుచుకున్న మృగాన్ని మరెవరైనా పొడిస్తే రాజకుమారులకు కోపం రావటం, అలాగ పొడిచిన వాళ్ల ప్రాణాలు సైతం తీయించివేయడం మామూలు. కాని ఆ రాజకుమారునికి

పాలంకి వెంకట రామచంద్రమూర్తి



మాత్రం ఆ కన్యపైన అలాంటి కోపమేమీ రాలేదు. ఆమె సాహసానికి బలానికీ అతడు మెచ్చుకుని, తన మెడలోని ముత్యాల హారం ఆమెకు వేయబోయాడు.

ఇందుకామె బిడియపడుతూ, 'నాకెందుకండి ఇటువంటి హారం! ఏమంత ఘనకార్యం చేశానని?...' అంటూ వినయంగా పక్కనించే పోయి, మంచె ఎక్కి యథాప్రకారం పిట్టలను తోలుకోసాగింది.

రాజకుమారుడూ అతని పరివారమూ మృగాన్ని చంపలేక, దానిని తరుముకు రావడంలో అలసిపోయారు. సమీపంలో ఒక సెలయేటి ఒడ్డున విశ్రమిద్దామని కూర్చున్నారు. కూర్చుని ఉండగా, ఒక మట్టి ఉండ రివ్వున వచ్చి, రాజపుత్రుని గుర్రం కాలికి తగిలింది. ఎవరు చెప్మా ఈ పని చేసింది? అని వాళ్లు నలుదిక్కులా చూడగా వడిసెలతో రాళ్లు రువ్వి పిట్టలను తోలుతూ ఉన్న పిల్ల కనబడింది. అప్పుడు పరివారంలో ఒకడు పరుగెత్తి వెళ్లి పిల్లతో, 'అమ్మాయీ, నువ్వు అపరాధం చేశావు! ఎవరున్నారో చూసుకోకుండా ఇలాగ రాళ్లు రువ్వవచ్చా?' అన్నాడు. ఆమె వెంటనే మంచె దిగి, జొన్న కంకులు కొన్ని చేత పట్టుకు వచ్చి రాజకుమారుని ముందు పెట్టి, 'నా తప్పు మన్నించండి; ఈ కంకులు ఆరగించండి', అన్నది. రాజకుమారుడు కోపించక 'ఫరవాలేదు', అంటూ ఆమెను పంపివేశాడు.

రాజపుత్రునికి కోపం రాలేదు, తక్కిన వాళ్లకి మాత్రం ఆమె అంటే మనస్సులో ఇదిగానే ఉంది. మకాముకు పోదామని రాజపుత్రుడు లేచాడు. తీరా పరివారంతో గుర్రాలెక్కి బయలుదేరేసరికి ఆ కన్య, నెత్తిపైన ఒక పాలకుండతోనూ రెండు వైపులా రెండు మేకపిల్లలతోనూ వస్తూ వారికి ఎదురయింది.

రాజుపుత్రుని పరివారంలో ఒకనికి ఆమెను బెదిరించాలన్న కొంటెబుద్ధి పుట్టింది. కళ్లెం వదులు చేసి రికాబులతో గుర్రం పక్కలు నొక్కి, వాడు దానిని ఆ కన్య

మీదకు దుమికించాడు. ఆమె కంగారు పడి పక్కకు తప్పుకోబోతుందని, అప్పుడామె పాలకుండ కిందపడి బద్దలైతే తమాషా చూసి అందరూ నవ్వుతారని వాడు ఆ పని చేశాడు.

కాని ఆ బాలిక చాలా తెలివైంది. వాడి టక్కరితనాన్ని ఇట్టే గ్రహించింది. తొణుకూ బెణుకూ లేకుండా, ఆ గుర్రానికి అడ్డంగా తన మేకపిల్లలలో ఒకదాన్ని చల్లగా వదిలింది. గుర్రం బెదిరి ఆ వీరశిఖామణిని నేలమీద పడవేసింది! ఆ పడుచు చెక్కు చెదరకుండా, చుక్కయినా పాలు తొణకకుండా మేకపిల్లలను తోలుకుంటూ ఏమీ ఎరగనట్లు తన దారిని తను పోయింది.

ఈ వినోదమంతా కనిపెట్టి చూస్తూ ఉన్న రాజకుమారుడు ఆ బాలికను పిలిచి, 'అమ్మాయీ! నీవెవరవు?' అని అడిగాడు.

'నా పేరు కురుందేవి' అన్నదామె.

'మీ ఇల్లెక్కడ'

'ఆ కనబడే పల్లెలో'.

'మీ తండ్రినొకమారు మా మకాముకు రమ్మని చెబుతావా?' అన్నాడు రాజపుత్రుడు. 'అలాగే,' అంటూ ఆమె తన దారిని పోయింది. రాజపుత్రుడు పరివారంతో కూడా మకాం చేరుకున్నాడు.

మరునాడు రాజ కుమారుని మకాముకు ఒక వృద్ధుడు వచ్చి, 'ఏమయ్యా!



మా పిల్లతో చెప్పి నాకు కబురు చేసింది నీవేనా?' అన్నాడు.

'ఔను. కురుందేవి తండ్రి మీరేనా?' అన్నాడు రాజకుమారుడు.

ఆ వృద్ధుని బట్టలు మాసిపోయి చిరుగులతో ఉన్నాయి. వాటిని బట్టి అతడు చాలా పేదవాడని వెల్లడయింది. ఐనా అతడు నెరసిన కోర మీసాలు సర్దుకుంటూ రాజకుమారుని పక్కనే కూర్చుని సమానఫాయిగా సంభాషణ మొదలెట్టాడు. పరివారానికంతకూ ఆశ్చర్యం వేసింది. రాజకుమారుడు మాత్రం ఆ వృద్ధుని సాహసానికి మెచ్చుకుని కొంతసేపైన తరవాత 'అయ్యా, మీ కురుందేవి నాకు రాణిగా

ఉండటం మీకిష్టమేనా?' అని అడిగాడు.

ఆ మాట అనేసరికి పరివారమంతా 'ఈ పేదవాడి కూతురునా రాజకుమారుడు పెండ్లి చేసుకోవడం!' అని విస్మయం పొందారు. 'ఇంతకంటేనా,' అని ఆ వృద్ధుడు ఎగిరి గంతేసి కూతురుని తెచ్చి రాజపుత్రుని పాదాలముందు నిలబెడతాడనుకున్నారు వాళ్లంతా. కాని వృద్ధుడలాంటి పని యేదీ చేయలేదు సరికదా, ఏ మాటా చెప్పక అలాగే ఊరుకున్నాడు.

రాజకుమారుడు చిరునవ్వుతో, 'నేను మీవార్ రాణావారి కుమారుణ్ణి! యువ రాణా హరసింగుని,' అన్నాడు. అందుకు వృద్ధుడు, 'తెలుసు. అందుకే నేనూ సందే హిస్తున్నాను' అన్నాడు. ఆశ్చర్యంతో యువ రాణా, 'ఎందుకు సందేహం?' అన్నాడు.

ఈ ప్రశ్నకు వృద్ధుడు, 'మాకు గల ధన మల్లా, శౌర్యం పౌరుషమున్ను. ఇంతకు మించి మరేమీ లేదు' అన్నాడు. 'నేను కోరింది ఆమెలోని శౌర్య ధనం చూసే!' అన్నాడు యువరాణా.

'అట్లయితే నాకభ్యంతరం లేదు. పిల్ల ఇష్టం తెలుసుకొని కబురు చేస్తా,' అంటూ వృద్ధుడు లేచి వెళ్లాడు.

ఆ రోజున కురుందేవిని బెదిరించ బోయి గుర్రం మీదనుంచి కిందపడ్డ రౌతు పక్కవాడితో 'ఈ ముసలి వాడికి ఎంత టెక్కో' అన్నాడు. పక్కవాడు.' మెల్లిగా మాటాడు. యువరాజుకు వినబడిందంటే మన ప్రాణాలు నిలబడవు. ఆయన రాణా వారితో వియ్యమందబోతున్నాడు. ఏమను కున్నావో!' అని మందలించాడు.

వాడన్నట్టే కురుందేవికీ హరసింగుకీ అతి వైభవంగా వివాహమైంది. ఆ దంప తులకు పుట్టినవాడే శత్రుభయంకరుడని పించుకున్న రాణా హమర్ సింగు.






# మోసకారి జీవితం

పూర్వం వంగరాజ్యాన్ని బృహస్పతి అనే బుద్ధిహీనుడు పరిపాలించేవాడు. తన కంటే ముందు పరిపాలించిన రాజుల మాదిరిగా మంచిపేరు తెచ్చుకోవాలని అతడు ఉబలాటపడేవాడు. మారువేషాలలో రాజ్యంలో సంచరించేవాడు. తన మంత్రిని కూడా తన వెంట బెట్టుకుని వెళ్ళేవాడు.

మంత్రి మాత్రం కపటబుద్ధితో వంగ రాజ్యాన్ని పొరుగురాజు పరం చేసి తన వంతుగా కొంత పరగణాను కైవసం చేసుకోవాలనుకునేవాడు. తనకు ఈ విషయంలో సహకరించే వ్యక్తిగా కాలుడు అనేవాడిని నియమించుకున్నాడు.

కాలుడితో మంత్రి, 'ఈ బుద్ధిలేని వాడి వద్ద కొలువు చేసేకంటే కొంత పరగణాను సొంతం చేసుకోవడం మోసం కిందికి రాదు. సమర్థుడి వద్ద పని చెయ్యడం ఎంతో గౌరవంగా ఉంటుంది,' అన్నాడు. కాలుడు అంగీకార పూర్వకంగా తల ఊపాడు.

బృహస్పతి మారువేషంలో మంత్రితో బాటు రథంమీద బయలుదేరేవాడు. నాలుగు గుర్రాలు కలిగిన రథం మీద ఆయన బయల్దేరడంతో ఆయన ఎవరో ఎందుకు బయల్దేరాడో ప్రజలకే కాకుండా దొంగలకూ, ఇతర నేరస్థులకూ తెలిసిపోయేది. రాజు కంట పడకుండా వాళ్ళు తప్పించుకునేవారు.

ఒకనాటి రాత్రి బృహస్పతి తన రథం మీద ఎప్పటి మాదిరిగానే బయల్దేరాడు. కొంత తడవు తర్వాత రథం దేవాలయం వీధిలో ప్రవేశించింది. బృహస్పతి చూస్తుండగానే ఒక యువకుడు తన మోకాళ్ళ మీద నడుచుకుంటూ దేవాలయంలోకి ప్రవేశించాడు.

బి. శిరీష



పండేపంటలు, చేతివృత్తులవారు, ప్రభుత్వ సిబ్బంది, పురం ఖర్చులు వంటి వివరాలు సేకరిస్తూ వచ్చాడు.

బృహస్పతితో ఆయన మంత్రి ముచ్చ టిస్తూ, 'ప్రభూ, తమరు కాలజ్ఞానిని అన వసరంగా అందలం ఎక్కించారేమోనని సందేహంగా ఉంది. అతడు మన రాజ్యం గురించి, పరిపాలనా, ఆంతరంగిక విష యాల గురించీ ఎన్నో రహస్యాలు సేకరి స్తున్నాడు.' అన్నాడు.

బృహస్పతి తేలికగా నవ్వి 'కాలజ్ఞాని తిరుగులేని దేశభక్తుడు. మన రాజ్యంలోని సమస్యలను పరిష్కరించాలని ప్రయత్ని స్తున్నాడు. రాజ్యానికి వచ్చే ఆదాయం పెంచాలని, ఖర్చు తగ్గించాలని లెక్కలు తయారు చేస్తున్నాడు. అయినా సరే వివ రాలు సేకరించి ఎవరైనా ఏం చేసుకో గలరు?' అన్నాడు.

ఎందువల్లో మంత్రి మొహం తేట పడింది.

మంత్రి వెళ్ళిపోయాక, కాలజ్ఞానిని తన వద్దకు రప్పించుకుని బృహస్పతి, 'నాయనా ఇప్పుడు చెప్పు. మా పూర్వపు రాజుల మాదిరిగా పరిపాలించి పేరు తెచ్చు కోవాలంటే మేము ఇంకా ఎలాంటి పథ కాలు చేపట్టవలసి ఉంది?' అని అడి గాడు.

కాలజ్ఞాని రాజుకు వినయపూర్వకంగా నమస్కరించి, 'మహారాజా, మనరాజ్యం అభివృద్ధికి ప్రాణాలర్పించడానికి సైతం నేను సిద్ధం. అంతఃపురంలో సిబ్బంది బాగా

ఆ యువకుడు భక్తిభావంతో తన్మయు డైపోయి, దేవతకు సాష్టాంగ నమస్కారం చేసి, 'తల్లీ కరుణామయీ, నా రాజ్యాన్ని శత్రువుల బారినుండి కాపాడు. నాతోపాటు నా రాజ్య ప్రజలను సుఖశాంతులతో బతి కించు. వారిని కూటికి, గుడ్డకు, గూడుకు లోటు లేకుండా ఆశీర్వదించు,' అన్నాడు.

దేవత సంగతేమో కాని, బృహస్పతి మాత్రం అతడి ప్రార్థనకు ముగ్ధుడైపో యాడు. ఇంతటి బుద్ధిమంతుడైన యువ కుడిని తన పాలనా వ్యవహారాల సలహా దారుగా నియమించాడు.

ఆ యువకుడు తన పేరు కాలజ్ఞాని అని చెప్పుకున్నాడు. రాచకొలువులో చేరింది మొదలుకుని కాలజ్ఞాని వంగ రాజ్యపు సరిహద్దుల గురించి, రాజ్యంలో

పెరిగిపోయారు. సగానికి సగం సిబ్బందిని తగ్గించుకుంటూ పోతే మనకి భద్రతా పెరుగుతుంది. జీతాల ఖర్చు సగం మిగులుతుంది' అన్నాడు.

ఖర్చు తగ్గుతుందనేసరికి బృహస్పతికి సగం ప్రాణం లేచివచ్చింది. రాజ్యానికి సమకూడే ఆదాయానికి, ఖర్చుకూ పొంతన లేకుండా పోయింది. కాలజ్ఞాని సలహాను వెంటనే పాటించి, అంతఃపుర సిబ్బందిని తగ్గించాడు బృహస్పతి.

ఉద్యోగాలు కోల్పోయిన వారు బృహస్పతిని శత్రువుగా భావించారు. సలహా ఇచ్చిన కాలజ్ఞాని మాత్రం వాళ్ల కంటికి కనిపించలేదు. మరికొన్ని రోజులకు, వ్యవసాయదారుల మీద పడ్డాడు బృహస్పతి. కాలజ్ఞాని సలహా మేరకు వారికి ఉచితంగా అందించే మేలురకపు విత్తనాలు, నాణ్యమైన ఎరువుల సరఫరా వంటివి తగ్గించాడు. రాజుకు చాలా ఆదాయం మిగిలిపోయింది. అయితే బీదా బిక్కీ రైతులు వ్యవసాయ పెట్టుబడులు లేక కూలిపనులకు వెళ్ళిపోయేవారు. వారంతా రాజుకు శత్రువులే అయ్యారు.

పంటభూములు కాస్తా బీడుపడ్డాయి. పంటలు తగ్గాయి. పంటల ధరలు పెరిగి రాజ్యంలో బీదాబిక్కీ ఆకలి చావులకు గురవుతూ వచ్చారు.

ధరల సెగ బృహస్పతికి సోకలేదు. ప్రజల్లో ఎవరైనా ముందుకొచ్చి రాజుకు ఈ విషయం చెప్పాలంటే కాలజ్ఞాని నియమించిన మనుషులు వాళ్లను చావగొట్టి



చెవులు మూసేవారు. రాజ్యంలో ఉండే చేతివృత్తుల వారి మీద పడ్డాడు బృహస్పతి. వారు అంతవరకూ చెల్లిస్తోన్న వృత్తి పన్నును రెట్టింపు చేశాడు. బంగారం మీద పన్ను పెంచాడు. బంగారు ఆభరణాలు తయారు చేసేవారికి వృత్తి పన్ను పెంచాడు. దాంతో ధనికులూ, బంగారపు పనివారూ బృహస్పతికి శత్రువులైన వారి జాబితాలోకి చేరిపోయారు. సైన్యానికి జీతాలు తగ్గించారు.

ప్రజల్లో అన్నివర్గాల వారూ బృహస్పతి తీసుకున్న నిర్ణయాలతో ఇబ్బందులను ఎదుర్కొంటూ వచ్చారు. ప్రజలు ఎక్కడికక్కడ తిరుగుబాటు వర్గాలుగా చేరిపోయి రాజును అంతం చేయడానికి పథకాలు వేస్తూ వచ్చారు. సైనికులు కూడా వారితో బాటు తిరుగుబాటుకు సిద్ధంగా ఉన్నారు.

కాలజ్ఞానికి ఈ పరిస్థితులు పూర్తిగా అర్థం అయ్యాయి. వాస్తవానికి అతడికి కావలసింది ఇలాంటి తిరుగుబాటు పరిస్థితులే. మంత్రిని కలిసి, 'అయ్యా! తమరు సలహా ఇచ్చినట్టే రాజ్యాన్ని ఎంతమేరకు చెడగొట్టాలో అంతమేరా నాశనం చేశాను. బృహస్పతిని చంపడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. తమరు వెంటనే పొరుగురాజుకు కబురు పంపవచ్చు,' అన్నాడు.

మంత్రి నవ్వి, అతడిని కావిలించుకుని, 'ఈ రాత్రికే పొరుగురాజు మన కోటలో ప్రవేశిస్తాడు,' అన్నాడు.

మంత్రి చెప్పినట్టే, పొరుగుదేశపు రాజు సైన్య సమేతంగా వంగరాజ్యంలో ప్రవేశించి బృహస్పతిని, అతడి కుటుంబాన్ని చంపేశాడు. బృహస్పతి సైన్యం కూడా పొరుగు రాజుకే వంతపాడింది.

కాలజ్ఞాని సలహాల మేరకు బృహస్పతి చేసిన మార్పుల్ని మొత్తంగా తొలగించి ప్రజల మన్నన పొందాడు పొరుగుదేశపు రాజు. ప్రజా జీవితం తిరిగి గాడిలో పడింది.

ఈ దశలో మంత్రీ, కాలజ్ఞానీ ఇద్దరూ రాజును కలుసుకున్నారు.

మంత్రి ఆయనకు వినయంగా నమస్కరించి, 'రాజ్యంలో శాంతిభద్రతలు నెలకొన్నాయి. తమరు నాకు ఒక పరగణాను కేటాయిస్తే, నేను దాన్ని పరిపాలించుకుంటూ బతుకుతాను' అన్నాడు.

రాజు నవ్వి, కాలజ్ఞానివైపు చూశాడు.

కాలజ్ఞాని రాజు మనస్సును అర్థం చేసుకున్నట్టుగా చటుక్కున కత్తితీసి మంత్రి తల నరికాడు. మంత్రి అక్కడికక్కడే కుప్పకూలాడు.

కాలజ్ఞానికి పరగణా కేటాయించాడు రాజు. ఇప్పుడు పరగణాకు కాలజ్ఞానే పరిపాలకుడు.

కాలుడికి మోసం చెయ్యడం నేర్పాడు మంత్రి. ప్రభువును మోసం చేయగలవాడు తనను సైతం మోసం చెయ్యగలడని మంత్రి ఊహించలేదు మరి. దానికి తగ్గట్టే కాలజ్ఞాని ఎప్పుడో పొరుగురాజుతో చెయ్యి కలిపాడు.





# పంచతంత్ర కథలు

పక్షులన్నీ పొలోమని గరుత్మంతుడి వద్దకు వెళ్ళి, లబోమని ఏడుస్తూ, ఉల్లంకిపిట్ట పెట్టిన గుడ్లను సముద్రుడు అన్యాయంగా హరించిన మాట చెప్పి, న్యాయం కలిగించ వలసిందిగా వేడుకున్నాయి.

'ఉల్లంకి పిట్ట తన గుడ్లను విడిచిపెట్టి ఎందుకు వెళ్లిపోవలిసి వచ్చింది?' అని గరుడుడు అడిగాడు.

'మహాప్రభూ, మేం మా పొట్టలు నింపుకునేటందుకు ఎక్కడి కెక్కడికో పోవాలి. ఉల్లంకి పిట్టలు తిండికోసం వెళ్ళి ఉన్న సమయంలో సముద్రుడు ఈ దురాగతం చేశాడు. ఈ ప్రపంచంలో అన్ని మోసాలకూ, కష్టాలకూ తిండే కారణమని సింహమూ, పోటేలూ కథను బట్టి తెలుస్తూనే ఉన్నది గద?' అన్నది ఆడబాతు.

'ఏమిటా కథ?' అని గరుత్మంతుడు అడిగాడు.

ముసలిబాతు ఆ కథను ఇలా చెప్పింది:

**సింహమూ, పోటేలూ కథ**

ఒక అరణ్యంలో ఒక పోటేలు మందకు దూరమై, ఒంటరిగా జీవిస్తూ ఉండేది. దట్టంగా పెరిగిన దాని రోమాలూ, భయంకరమైన కొమ్ములూ, దాని అరుపూ చూసి అది అడవిలో స్వేచ్ఛగా తిరిగేటప్పుడు ఇతర మృగాలు హడలిపోతూ ఉండేవి.

ఒకనాడు ఒక సింహం అనుకోకుండా దాన్ని చూడడం తటస్థించేసరికి, దాని పెద్ద శరీరమూ, రోమాలూ, కొమ్ములూ చూసి బెదిరి, 'అమ్మో, ఇది నిశ్శంకగా అరణ్యంలో సంచరిస్తున్నదంటే, నా కన్న ఎన్నో రెట్లు బలం కలదై ఉండాలి.'

మిత్రభేదం–21



అనుకున్నది. అయితే, ఒకనాడు ఆకలి తీర్చుకోవడానికి ఆ పొటేలు గడ్డి మేస్తూ సింహం కంటబడింది.

'ఓస్, ఇది గడ్డి తినే జంతువేనా! ఇది నా అంత బలం గలది కావడానికి వీల్లేదు. ఇది నాకు ఆహారం కాదగినది' అనుకుని, సింహం ఆ పొటేలును చంపి తినేసింది.

ముసలి బాతు ఈ కథ పూర్తి చేస్తూం డగా, విష్ణువు వద్దనుంచి గరుత్మంతుడికి త్వరగా రమ్మని పిలుపు వచ్చింది.

విష్ణువు గరుత్మంతుడి మీద ఎక్కి ఎక్కడికో వెళ్లాలట.

గరుత్మంతుడు విష్ణువు దగ్గిరికి వెళ్లి, 'స్వామీ, ఇప్పుడు ఎలా రాను? నా జాతికి చెందిన ఈ ఉల్లంకిపిట్ట గుడ్లు సముద్రుడు అపహరించాడు గదా, వాటిని నేను ఉల్లంకి పిట్టకు తిరిగి ఇప్పించడం నా ధర్మం కదా! సముద్రుడు ఇలాంటి దుర్మార్గాలు చేస్తూ ఉంటే, నేను ఏలిన వారికి వాహనాన్ని అన్న ఘనత ఏమున్నదీ?' అన్నాడు.

వెంటనే విష్ణువు తన వింటికి బాణం సంధించి, సముద్రుడితో, 'ఉల్లంకి పిట్ట గుడ్లను తక్షణం ఇచ్చెయ్యి. లేకపోతే ఈ బాణంతో నిన్ను ఎండగట్టి, ఇసుక పర్రగా చేసేస్తాను' అన్నాడు.

ఈ మాటకు సముద్రుడు భయంతో కంపించి పోతూ, గుడ్లను తెచ్చి ఉల్లంకి పిట్టల జంటకు సమర్పించుకున్నాడు.

దమనకం సంజీవకానికి ఈ కథ చెప్పి, 'నీకు అలాంటి మిత్రులెవరున్నారు? అందుచేత నువు సింహంతో తలపడే ఆలో చన మాను' అన్నది.

'మిత్రమా, పింగళకం నన్ను చంపదలి చినదీ, లేనిదీ నాకు ఎలా తెలుస్తుంది?' అని సంజీవకం దమనకాన్ని అడిగింది.

'అది తేలికగానే తెలుసుకోవచ్చు. సింహం తన సింహాసనమైన రాతిమీద కూర్చుని, నువు దగ్గిరకి వెళ్ళినప్పుడు, నవ్వుతూ, ప్రశాంతంగా ఉంటే నీకు ప్రమాదం లేదన్నమాట.

కాని సింహం కనుక తోకమెలిదిప్పుతూ, పంజాలు బిగబట్టి నువు దూరాన కనిపిం చగానే నీకేసి తీక్షణంగా చూస్తూ, ఉగ్ర రూపంలో కనిపించిందంటే అప్పుడది

నిన్ను చంపబోతున్నట్లు ఖాయం చేసు కోవచ్చు' అన్నది దమనకం.

తరవాత దమనకం వెళ్ళి కరటకాన్ని కలుసుకున్నది.

'ఏం చేసుకువచ్చావు?' అని కరటకం అడిగింది.

'ఇద్దరిమధ్యా చిచ్చుపెట్టి వచ్చాను' అన్నది దమనకం.

'నిజంగానా?' అన్నది కరటకం.

'నా ప్రయత్నాలు ఎలా ఫలించేదీ నువు అతిత్వరలోనే చూస్తావు. ఇన్నాళ్ళుగా ఎద్దుకూ, సింహానికీ మధ్య కొనసాగిన స్నేహబంధాన్ని శాశ్వతంగా తెంచి పారే శాను' అన్నది దమనకం.

'అందులో ఆశ్చర్యమేమున్నదీ? అదే పనిగా నీరు ప్రవహిస్తూంటే కొన్నాళ్ళకు రాళ్లు కూడా అరిగిపోతాయి.

నువు విడవకుండా కుట్ర చేస్తే వాళ్ళ స్నేహం చెడిపోవచ్చు.

కాని ఇంత పెద్ద పన్నాగం పన్నినావు గదా! చివరికి, ఇందువల్ల నీకేం ఒరుగుతుం దనుకుంటున్నావు?' అని కరటకం దమన కాన్ని ప్రశ్నించింది.

'అదేం ప్రశ్న? నేను ప్రధానమంత్రినై, ఎంతో లాభం పొందబోతున్నాను. గ్రంథాలు పడచదివి కూడా ఆ చదువువల్ల డబ్బూ, అధికారమూ సంపాదించుకోలేనివాడి చదువు వ్యర్థమని పెద్దలు చెబుతారు,' అన్నది దమనకం.

'కాని స్వార్థం కూడా హీనమైనదే గద! ఈ తుచ్ఛమైన శరీరం కోసం ఏది పడితే అది చెయ్యరాదు.

అదీగాక, నీమోసం బయటపడి, వంచ కుడి కథలోలాగ, నీ ప్రాణానికే అపాయం కలగవచ్చు' అన్నది కరటకం.

'ఏమిటా కథ?' అని దమనకం అడి గింది. కరటకం వంచకుడి కథ ఇలా చెప్పనారంభించింది: (ఇంకా ఉంది)





# స్వర్ణనిధి

సుఖరాం అణకువైన రైతు. సకాలంలో వర్షాలు కురవడంతో తనకున్న కాసింత భూమిని దున్నటంలో మునిగిపోయాడు. ఒకరోజు, పనిలో ఉండగా భూమి లోపల నుండి పెద్దగా శబ్దం వినిపించింది. అతడు శబ్దం వినిపించిన చోట లోతుగా తవ్వాడు. అతడికి మూత బిగించి ఉన్న ఒక పెద్ద కంచు పాత్ర కనిపించింది. దాన్ని తీసుకుని అతడు మూతను పగులగొట్టాడు.

పాత్రలో బంగారు నగలు నిండుగా కనిపించడంతో అతడి గుండె లయతప్పింది. కాస్సేపు మూగగా దానికేసి చూస్తుండిపోయాడు. తర్వాత తను కల కనలేదని ధృవపర్చుకోవాలని, పాత్రలోని కొన్ని నగలు బయటకు తీయడానికి ప్రయత్నించాడు.

ఉన్నట్లుండి, ఓ పెనుకేక వినిపించింది. 'దాన్ని తాకవద్దు'. ఆ అరుపుకు దడుచుకున్నాడు సుఖరాం. తేరుకుని చూడగా కుడివైపున పెద్ద భూతం కనిపించింది.

'భయపడకబ్బాయ్, నేను కీడు తలపెట్టను', అని చెప్పిందా భూతం.

'చాలా కాలం నుంచి ఈ నిధికి కాపలా కాస్తున్నాను. పోయి గ్రామస్తులను అందరినీ ఇక్కడికి పిలుచుకురా. సరైన వ్యక్తిని వెతికి పట్టుకుని ఈ నిధిని అప్పగించాలి'. అన్నది భూతం. సుఖరాం ఒక్కసారిగా లేచి అక్కడ నుంచి పరుగెత్తాడు.

అతడు తిరిగొచ్చేసరికి గ్రామం మొత్తంగా అతడి వెన్నంటి వస్తోంది. భూతం గ్రామస్థులకు ఆహ్వానం పలికింది. 'మిత్రులారా, నేను ఈ గ్రామానికి చెందినవాడినే, నేను చనిపోయినప్పటి నుంచి ఈ నిధిని కాపలా కాయవలసిన బాధ్యత నాపై పడింది. దీన్ని సరైన వ్యక్తికి అప్పగించేందుకు సమయం

డి. జానకి

ఆసన్నమయింది. ఈ బంగారును మొత్తంగా స్వాధీన పర్చుకోవాలనుకుంటున్న వారు ఒకరి తర్వాత ఒకరు ముందుకు రండి'.

భూతం ఇలా చెప్పిందే తడవుగా, గ్రామం మొత్తంగా ముందుకొచ్చింది. 'ఆగండి మిత్రులారా ఆగండి', అన్నది భూతం. 'ఈ నిధిని ఎవరైనా తీసుకోవచ్చు, అయితే, మీరు నిధిని తీసుకోబోయేముందు, నేను చెప్పేది వినండి.' అంటూ భూతం కాస్సేపు ఆగింది. వాళ్లకేసి చూస్తూ మళ్లీ ఇలా అంది.

'ఈ నిధి గురించి తెలుసుకోండి. ఈ నిధిని ముగ్గురు దొంగలు లూటీ చేశారు. దీన్ని పంచుకోవాలని వాళ్లు ఇక్కడికి వచ్చారు. పంపకాల విషయంలో వాళ్ల మధ్య తీవ్రంగా ఘర్షణ జరిగి ఆ క్రమంలో వాళ్లు పరస్పరం చంపుకున్నారు. కాబట్టి, ఈ ముగ్గురిలో ఎవరూ ఈ నిధిపై చేయి వేయలేకపోయారు. అప్పటినుంచి ఈ నిధికి శాపం తగిలింది. ఈ నిధిని ఎవరైతే కలిగి ఉంటారో వాళ్ల జీవితం ఇక్కట్ల పాలై, తమ సంపదను, కుటుంబాన్ని సైతం కోల్పోతారు. ఇప్పుడు రండి. ఒకరి వెనుక ఒకరు వచ్చి ఈ నిధిని తీసుకోండి!'

ఎవరూ తమ స్థానాల నుండి ముందుకు కదల్లేదు. ఒక్కసారిగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది. తర్వాత గ్రామస్తులు అక్కడి నుంచి వెళ్లిపోసాగారు. వెళ్లిన వారు వెళ్లగా ఒకే ఒక మనిషి అక్కడే నిలబడిపోయాడు. అతడు వారితో పాటు వెళ్లలేదు. నింపాదిగా కాస్త ముందుకు వచ్చి అతడు ఇలా అన్నాడు. 'ఓ భూతమా, ఈ నిధిని అందుకోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను'.




ఈ మాటలకు భూతం మ్రాన్పడిపోయింది. వెళ్ళిపోతున్న గ్రామీణులు కూడా ఒక్కసారిగా ఆగిపోయి, అతడి మాటలు విని ఆశ్చర్యపోయారు.

'అబ్బాయీ, నీకేమైనా పిచ్చెక్కిందా? బంగారుపై వ్యామోహంతో గుడ్డివాడివైపోయినట్లుంది', అన్నది ఆ భూతం.

'లేదు లేదు, నా తెలివికి ఏ ఢోకా లేదు. తెలివితో ఉండే మాట్లాడుతున్నా', అన్నాడా యువకుడు.

'నీ పేరేంటి'? అన్నది భూతం. నేను వల్లభవర్మని. నన్ను వల్లభా అని పిలువవచ్చు'.

'వల్లభా, నీవు నవ యువకుడివి. నీకు నిండైన జీవితం ఉంది. ఈ నిధిని తీసుకుని నీ వినాశనాన్ని నీవే కొనితెచ్చుకొంటున్నావు?' అని గ్రామస్తులు హెచ్చరించారు.

'భూతమా! ఇప్పుడు నీవు నేను చెప్పే మాటలు ఆలకించాలి', అన్నాడు వల్లభుడు. 'ఈ నిధిని నా బాగు కోసం తీసుకోవాలను కోవడం లేదు. పేద గ్రామీణులకు ఈ నిధిని ఖర్చుపెట్టదలిచాను. అక్కడ ఎండిపోయిన ఆ చెరువును చూస్తున్నావు కదా, చెరువులో పూడికను తొలగించడానికి ఈ నిధిని ఉప యోగించాలనుకుంటున్నాను. కాలువలకు మరమ్మతులు చేసి రైతులకు పంటలు వేసు కోవడానికి తగిన నీటిని కల్పించాలని ఉంది.

గ్రామ మహిళలకు మంచి నీటి సమస్య లేకుండా బావులు తవ్విస్తాను. అలాగే ఉచిత పాఠశాలలు, ఆసుపత్రులు కూడా కట్టిస్తాను. నా తోటి వారి సంక్షేమం కోసం ఈ నిధిని ఉపయోగిస్తాను.

ఈ పనులు చేసినందుకు గాను ఈ నిధిని అంటిపెట్టుకుని ఉన్న శాప ఫలాన్ని నేను అనుభవించవలసి వస్తే సంతోషంగా దాన్ని స్వీకరిస్తాను'.

'వారెవా!' అంటూ ఆశ్చర్యం వ్యక్తం చేసింది భూతం. 'నీవు సామాన్యుడివి కావు. దైవసమానుడివి. నేను శిరసు వంచి నీకు నమస్కరిస్తున్నాను. నేనెవరో నీకు తెలుసా? ఈ నిధిని కొల్లగొట్టి పంచుకునే క్రమంలో కొట్టుకుని చనిపోయిన ముగ్గురు దొంగల్లో ఒకడిని. చనిపోయి భూతంగా మారిన తర్వాత నేను ఈ నిధిని అంటిపెట్టుకుని కావిలి కాస్తూ, దీన్ని స్వీకరించే సరైన వ్యక్తి కోసం చూస్తున్నాను.

ఇన్నాళ్ళకు నా చిరకాల నిరీక్షణ ఫలిం చింది. గత జీవితంలో నేను చేసిన పాపాలకు గాను ఇన్నాళ్ళుగా పశ్చాత్తాపం ప్రకటిస్తూ వచ్చాను.

ఈ నిధిని వదిలించుకున్న తర్వాత దేవు డిని క్షమించవలసిందని కోరాలనుకున్నాను. కాని ఇప్పుడు నేను దేవుడికోసం వెదకవలసిన అవసరం లేదు. బదులుగా నన్ను క్షమిం చాలని నిన్నే వేడుకుంటాను. దివ్య పురు షుడా, ఈ నిధిని స్వీకరించి నా పాపాలనుండి నన్ను విముక్తి చేయి'.

తర్వాత ఆ భూతం వల్లభుడి పాదాలకు మొక్కి క్షమించమని కోరుకుంది.





# కోయిల కూసిన దేశం

వినీల దేశాన్ని పాలించే సుమంతుడు రాజ్యంలో ఎన్నో పరిశ్రమలను స్థాపించాడు. అడవులు కొట్టించి గృహాలు నిర్మించాడు. అందువల్ల దేశం అభివృద్ధి చెంది ప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయి.

ఐతే దేశంలో వర్షాలు కురవడం మానే శాయి. పంటలు పండక తిండి గింజలను దిగుమతి చేసుకోవలసి వచ్చింది. ప్రజలలో అనారోగ్యం పెచ్చు పెరగడంతో ప్రభుత్వ ఖజా నాలో అధిక భాగం వీటి నిమిత్తమే ఖర్చు అయ్యేది.

ఓ సారి హిమాలయాల నుండి రాజ్యా నికి విచ్చేసిన సాధువు దర్శనం చేసుకున్నాడు రాజు సుమంతుడు. సాధువుకి ప్రణమిల్లి తన రాజ్యానికి సంక్రమించిన కష్టాన్ని గూర్చి విన్నవించుకున్నాడు.

సాధువు ఓ క్షణం కన్నులు మూసుకుని ధ్యానముద్ర వహించాడు. అనంతరం రాజు నుద్దేశించి, 'వినీల దేశంలో కోయిల కూసిన నాడే మీ సమస్యలు సమసిపోతాయి' అని చెప్పాడు. రాజ్యంలోని ప్రతి గ్రామంలోనూ కోయిలలు కూసే ఏర్పాటుచేయవలసిందిగా ఆదేశించాడు సుమంతుడు. అయితే దేశంలో ఎక్కడా కోయిల జాడ లేదన్న సత్యం అప్పుడు గానీ తెలియలేదు.

పొరుగు దేశాల నుండి కమ్మగా పాడే కోయిలలను కొని తెచ్చారు. వాటిని పంజ రాలలో ఉంచి, తిండి గింజలను వేసారు. అవి గళం విప్పడం కోసం ఆత్రుతతో ఎదురు చూసారు.

కాని ఎన్నాళ్ళు గడిచినా, గొంతులు మూగ వోయినట్టు మౌనంగా ఉండిపోయాయి కోయిలలు. వాటిని పంజరాలలోంచి బైటకు తీసారు. ఐనా అవి గళం విప్పలేదు. ఎటో ఎగిరిపోయాయి. కారణం బోధపడక హతా శులయ్యారంతా.

తిరుమలశ్రీ

తీర్థయాత్రలు ముగించుకున్న సాధువు తిరుగు ప్రయాణంలో మళ్ళా వినీల దేశానికి విచ్చేశాడు. సుమంతుడు అతన్ని కలుసుకున్నాడు. కోయిల విషయంలో తాను చేసిన విఫల ప్రయత్నాలను వివరించాడు.

అంతా శ్రద్ధగా ఆలకించిన సాధువు, 'వసంత ఋతువులో ప్రయత్నించారా?' అని ప్రశ్నించాడు. సమాధానంగా రాజు, మంత్రి వంక చూసాడు.

'మేము ఋతువులను మరచిపోయి చాలా ఏళ్ళయింది స్వామీ! దేశంలో ఏడాది పొడవునా ఎండలు మాడ్చేస్తున్నాయి' అన్నాడు మంత్రి సవినయంగా.

సాధువు నవ్వాడు, 'చెట్లు నరికి అరణ్యాలను ధ్వంసం చేస్తే ఋతువులెలా వస్తాయి? పరిశ్రమల మీద అతిగా దృష్టిని సారించి రాజ్యాన్ని రాతి అడవిగా మార్చేసారు మీరు. పచ్చదనం లేని చోట మేఘాలు ఎక్కణ్నుంచి వస్తాయి? వసంతానికి నోచుకోని దేశంలో కోయిలలు ఎందుకు అడుగిడతాయి? వాటి గళం ఎలా పెకలుతుంది?.. కోయిల కూసే దేశం సుభిక్షమవుతుంది. ఇప్పటికైనా వాస్తవాన్ని గ్రహించి దేశంలో చెట్లు నాటించండి. అడవులను పెంచండి. త్వరలోనే మీ సమస్యలు సమసిపోతాయి.. పరిశ్రమలూ, గృహ నిర్మాణమూ అవసరమే. అలాగని వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేసి, అడవులను నాశనం చేయతగదు. వృక్షసంపదను నిర్లక్ష్యం చేయడం తగదు', అంటూ హితబోధ చేసాడు.

సాధువు పలుకులతో రాజు సుమంతుడు తన తప్పిదం గ్రహించాడు. వెంటనే దేశమంతటా చెట్లు నాటి, వనాలూ పెంచే కార్యక్రమాన్ని యుద్ధ ప్రాతిపాదికన ఆరంభించాడు.

ఫలితంగా అనతి కాలంలోనే వినీల దేశంలో మళ్లీ పచ్చటి ప్రకృతి తాండవమాడింది. దాంతో పాటే పక్షులూ, జంతుజాలమూ పుట్టుకొచ్చాయి. మళ్ళీ సకాలంలో వర్షాలు కురవనారంభించాయి. ఋతువులు తిరిగి వచ్చాయి. ప్రజల అనారోగ్య సమస్యలు క్రమంగా తగ్గుముఖం పట్టి ఆరోగ్యం మెరుగుపడింది. ఓ పక్క పరిశ్రమలు, మరో పక్క వ్యవసాయము, వన సంపదా సమపాళ్ళలో వృద్ధి చెందడంతో వినీల దేశం సుభిక్షమై ఆదర్శ రాజ్యంగా నిలిచింది.





# ఎంపిక

శివపురం గ్రామంలో వరదరాజు అనే రైతు ఉండేవాడు. అతడికి శివుడు ఒక్కడే కొడుకు. శివుడి ఆ ఊరి బడిలో చదివాడు.

అక్కడి చదువు పూర్తయ్యాక వరదరాజు, కొడుకుతో 'నాయనా! నేను రైతునేగాని, నిన్ను కూడా రైతునే చేయాలన్న ఉద్దేశం నాకు లేదు. ఇక్కడి నీ చదువు పూర్తయ్యింది. ఇంకా చదవాలంటే పట్నం పంపాలి. అది నాశక్తికి మించిన పని. అయినా నువ్వు చదువుతానంటే పట్నం పంపుతాను. మరి వ్యవసాయం, చదువు రెండింటిలో ఒకటి ఎంపిక చేసుకునే బాధ్యత నీది!'' అని చెప్పాడు.

ఆలోచించిన శివుడు 'నాన్నా! నేను వ్యవసాయం చూసుకుంటూ నీకు చేదోడుగా ఉంటాను' అన్నాడు. 'వ్యవసాయం ఎందుకు ఎంపిక చేసుకున్నావు?' అని అడిగాడు వరదరాజు. 'అందరూ చదువులకూ, ఉద్యోగాలకు పట్నం వెళ్ళిపోతే మరి వ్యవసాయం ఎవరు చేస్తారు? అందరూ పల్లకీ ఎక్కితే మోసే వాళ్ళు కూడా ఉండాలి కదా!' అన్నాడు శివుడు. వరదరాజు కొడుకువంక మెచ్చుకోలుగా చూసాడు.

వరదరాజు కూడ బెట్టిన డబ్బుతో ఒక ఇల్లు కొనాలనుకున్నాడు. రెండు ఇళ్ళు అమ్మకానికి ఉన్నట్లు తెలిసింది. ఒక ఇల్లు బంగారయ్య అనే ప్రముఖ వ్యాపారి ఇంటి ప్రక్కన ఉంది. మరో ఇల్లు పరశురాములు అనే కంసాలి ఇంటి పక్కన ఉంది. రెండూ ఇళ్ళు చూసి వచ్చిన వరదరాజు రెండూ బాగానే ఉన్నాయనే భావించి ఒక ఇంటిని ఎంపిక బాధ్యత కొడుక్కి అప్పగించదలిచాడు.

అతను శివుడితో 'శివా! ఇంతకాలానికి ఇల్లు కొనబోతున్నాను. నిజానికి ఆ ఇల్లు నీ కోసమే. అందుకని ఎంపిక బాధ్యత నీదే! నేను చూసిన రెండిళ్ళలో మంచి ఇల్లు ఎంపిక చేసుకో!' అని చెప్పాడు.

ఎన్. శివనాగేశ్వరరావు

శివుడు పరిశీలించి కంసాలి ప్రక్కనున్న ఇంటిని ఎంపిక చేశాడు. 'ఎందుకని ఆ ఇల్లు ఎంపిక చేసావు! బంగారయ్య ఇంటి పక్క ఇల్లు విశాలంగా ఉంది. అదే ధరకు వస్తున్నది కదా!' అన్నాడు వరదరాజు. 'నాన్నా! బంగారయ్య ధనికుడు. అతడి ఇంటి ప్రక్కన ఉంటే అన్ని విషయాల్లో అతనితో పోల్చి చూసుకుంటాము. అది అసంతృప్తిని కలిగిస్తుంది. అదే మన స్థాయి కలిగిన వ్యక్తి ఇంటి ప్రక్కన ఉంటే మనశ్శాంతిగా ఉంటుంది'. అన్నాడు శివుడు. వరదరాజు శివుడి ఎంపిక ప్రకారమే కంసాలి ఇంటి పక్కన ఇల్లు కొనుగోలు చేశాడు.

శివుడికి యుక్త వయస్సు వచ్చింది. సంబంధాలు రాసాగాయి. అందులో రెండు సంబంధాలు వరదరాజుకి నచ్చాయి. వనజ రాములయ్య అనే రైతు కూతురు. విమల ధనరాజు అనే ధనికుడి కూతురు. అమ్మాయిలు ఇద్దరూ చూడముచ్చటగా ఉన్నారు.

వరదరాజు శివుడితో 'వీరిలో ఒకరిని ఎంచుకునే బాధ్యత నీది' అని చెప్పాడు. శివుడు, రైతు కూతుర్ని ఎంపికచేస్తాడని అతడు భావించాడు. అయితే శివుడు, విమలను వివాహం చేసుకోవాలని భావించాడు.

అందుకు వరదరాజు ఆశ్చర్యపడుతూ 'అంత కలవారి అమ్మాయి మన ఇంటి కోడలుగా వస్తే ఇమడగలదా? తన భేషజం చూపి మనల్ని ఇబ్బందుల పాలు చేస్తుందేమో! ఆలోచించావా!' అని అడిగాడు.

అందుకు శివుడు ''వనజను చూడ్డానికి వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి 'పల్లెటూరిలో ఉండి ఎంత కాలం వ్యవసాయం చేస్తారు? పొలం అమ్మి పట్నం వెళ్లి ఏదైనా వ్యాపారం చేస్తూ అక్కడ స్థిరపడదాం' అన్నది. అయితే విమల 'నాకు చిన్నప్పటి నుంచి తల్లి లేదు. కాబోయే అత్తలోనే అమ్మను చూసుకోమని నాన్న చెప్పేవారు. డబ్బు గలవారి ఇళ్ళల్లో ప్రేమలు తక్కువ. అందుకే మీ ఇంటికి వచ్చి ఆ ప్రేమను పొందాలనుకుంటున్నాను' అని చెప్పింది. అటువంటి ప్రేమించే మనసున్న అమ్మాయికి ధనం ఉందన్న అహం ఉండదు. అందుకే విమలను భార్యగా ఎంపిక చేసుకున్నాను'' అని చెప్పాడు. 'నీ ఎంపిక సరైనదే!' అని మెచ్చుకున్నాడు వరదరాజు.






# శాంతిదేవత

పూర్వకాలమందు కొంతమంది కత్తిని ఆశ్రయించి బతికేవాళ్లు. అనగా, కత్తిని చేతపట్టి యుద్ధాలలో పాల్గొని జీవనం సాగించేవారు.

అలా అనేక యుద్ధాలలో పనిచేసిన మహాయోధుడు శూరసింహుడు. అత నికి ఒకానొకప్పుడు ఉద్యోగం లేకుండా పోయింది.

ఎందుకంటే రాజులకు యుద్ధాలంటేనే విసుగుపుట్టింది. అందుచేత వారిలో వారు సంధులు చేసుకున్నారు. రాజ్యం ప్రశాంతంగా ఉంటే యుద్ధమెందుకు? సైనికులెందుకు?

ఇప్పుడు శూరసింహుడికి గట్టి చిక్కే వచ్చింది. అతనికి చేతనైన పని ఒక్కటే, కత్తి చేపట్టడం. ఎన్ని తలలైనా అవలీలగా నరికివేయగలడు. మరిప్పుడు యుద్ధం పని లేదాయె. వానికి మరేపనీ చేతకాదాయె. ఎలా?

రాజులంతా పిరికిపందలైపోయారు! ప్రజలంతా పౌరుషహీనులయారు! నా కత్తి మూలపడవలసిందేనా! తుప్పు పట్ట వలసిందేనా? అని అతనికి తీరని విచారం కలిగింది.

ఏమైతేనేం, తిండికి గుడ్డకూ మోహం వాచి, శూరసింహుడు కృశింపసాగాడు. గడ్డిగాదం లేక అతని గుర్రం బక్కచిక్కి పోయింది. చివరకు విధిలేక ఉద్యోగం కోసం బయల్దేరాడు శూరసింహుడు.

వెళ్లగా, వెళ్లగా, ఒకనాటి సూర్యోదయం వేళ ఒక పొలం చేరుకున్నాడు. ఆ పొలం దున్నుకుంటున్న రైతును శూరసిం

డి. సావిత్రి




హుడు తన గుర్రం మీదనించే కేకవేసి 'ఓయీ, నా పేరు శూరసింహుడు, విన లేదా? నేను మహాయోధుణ్ణి. నేనిప్పుడు పని లేకుండా ఉన్నాను. నాకేమైనా పని చూపించగలవా?' అన్నాడు.

ఈ ప్రశ్న వినగానే రైతు దున్నటం మాని, శూరసింహుడి కేసి చప్పున తిరిగి చూశాడు. ఒరలో కత్తీ, వాలకం చూడగా రైతుకు భయమూ వేసింది. జాలీ కలి గింది. 'నాగలి దున్నటం చేతనైతే నా దగ్గిర పని ఉంది. ముందు ఆ కత్తీ కటా రులూ అవతల పారవేసి రావయ్యా', అన్నాడు రైతు.

అందుకు శూరసింహుడు 'అబ్బాయీ! నాగలి దున్నటం నాచేత కాదు. నీకు శత్రువులెవరైనా ఉంటే చెప్పు. నిమిషంలో వాళ్ళ తలలు నరికి నీ ఎదట పెడతా. నాకు భోజనం, నా గుర్రానికి ఇంత దాణా ఏర్పాటు చేస్తే చాలు, మరేమీ వద్దు', అన్నాడు.

రైతు మాటాడలేదు. క్షణకాలం శూర సింహుని కేసి చూసి మళ్ళీ ఎప్పటిలా పొలం దున్నుకోసాగాడు.

'హ! పౌరుషహీనులు! మనిషన్న తర వాత శత్రువే ఉండడా? చేతకాకపోతే సరి, శత్రువును సంహరించడం? పైగా నన్ను నాగలి దున్నుకు బతకమంటున్నాడు ఈ పిరికి పంద. నావంటి యోధుడు చేయ వలసిన పనేనా ఇది?' అనుకున్నాడు తనలో శూరసింహుడు.

అనుకొని అలా ఒక అరణ్యమార్గం పట్టి పోగా పచ్చటి మైదానం కంటపడింది. ఆ మైదానంలో మంచి ఎత్తున ఒక దేవతా విగ్రహం ఉన్నది.

అదే యుద్ధదేవత! ఉత్సాహంతో గుర్రాన్ని దౌడుతీయిస్తూ పోయి, శూర సింహుడు ఆ విగ్రహం ముందు నిల బడ్డాడు.

ఆ దేవి విగ్రహం ఇరవై అడుగుల ఎత్తున ఉంది. నిప్పులు చెరిగే కన్నులు, చేతులలో -- విచ్చుకత్తులు భయం కొల్పుతూ ఉన్నాయి.

కాని, దేవి చేతిలో కత్తి చూడగానే శూరసింహుడు సంతోషంతో ఉప్పొంగి




పోయాడు. 'ఆహా! ఏమి విగ్రహం!! అంతా అచ్చ బంగారం!!!' అని ఒక్క కేక వేశాడు, ఉత్సాహం పట్టలేక.

'కాదోయ్. విగ్రహమంతా వెండి! ఇది రజత విగ్రహమే కాని స్వర్ణవిగ్రహం ఎంతమాత్రం కాదు,' అంటూ బదులుగా అతనికి ఒక కేక వినిపించింది.

కేక వినిపించేటంతలోనే ఆ విగ్రహానికి వెనుకనుంచి డాలూ కత్తీ ధరించిన ఒక గుర్రపు రౌతు ముందుకు వచ్చాడు. పౌరుషంతో శూరసింహుడు పళ్లు కొరికాడు. ఒరలోనించి కత్తిదూశాడు. 'అరేయ్..! నా మాటనే ధిక్కరిస్తున్నావా? నా పేరేమిటో తెలుసా? శూరసింహుడు..' అని గర్జించాడు.

రెండవ యోధుడు వెటకారంగా నవ్వి, కత్తి ఒరలో నుండి బయటకు లాగుతూ..

'హ! నువ్వు కళ్లు లేని కబోదిలాగా ఉన్నావే! వెండికీ, బంగారానికీ తేడా తెలియని నీతో యుద్ధానికి తలపడటమంటే నిజంగా నాకు అవమానకరంగా తోస్తున్నది. నా పేరేమిటో తెలిసే మసులుకొంటున్నావా? నేను ధీరసింహుణ్ణి. రా, నా కత్తిబలం చవి చూపిస్తా,' అన్నాడు, గుర్రాన్ని ముందుకు ఉరకలు వేయిస్తూ.

మరుక్షణంలోనే యోధులిద్దరూ తలపడ్డారు. కత్తుల వొరిపిడితో, గుర్రాల సకిలింపులతో, వారి పరుషవాక్కులతో ఆ ప్రదేశం తెరిపిలేకుండా మారుమోగిపోతున్నది. అంతలో హఠాత్తుగా 'ఆగండి! కత్తులు ఒరలో పెట్టండి!!' అంటూ ఒక కేక వినిపించింది. యోధులిద్దరూ ఆ కేక వచ్చిన దిక్కుకు ఆశ్చర్యంగా చూశారు.

చూసేసరికి, మల్లిపువ్వులవంటి తెల్లటి దుస్తులు ధరించినది, శాంతం ఉట్టిపడుతున్న మోము కలది, ఒక అందమైన యువతి నవ్వుతూ వారివద్దకు వచ్చి 'మీ ఇద్దరూ మహాయోధులే! అసహాయ శూరులే!!' అన్నది

'వాని సంగతి ఏమో కాని, నా పేరు శూరసింహుడు,' అన్నాడు మొదటివాడు.

'వాని సంగతి తెలీదు కాని, నా పేరు ధీరసింహుడు,' అన్నాడు రెండవవాడు.

ఇద్దరి కేసి చూసి, ఆ యువతి 'మీ కత్తుల పదునులో కాస్తంతయినా మీ బుద్ధులకు ఉంటే ఈ కొట్లాట జరిగేది కాదు', అన్నది.

'ఈ మూర్ఖుడికి దూరదృష్టి లేదు. ఈ యుద్ధదేవత విగ్రహం వెండిదట!' అని పరిహసించాడు శూరసింహుడు.

'ఇతగాడికి దృష్టి వక్రించింది. వెండి విగ్రహాన్ని బంగారు విగ్రహమని వాదించడమేమిటి, అవివేకం కాకపోతే!' అని గేలి చేశాడు. ధీరసింహుడు.

అప్పుడా యువతి పకపక నవ్వి, యోధులిద్దరినీ వెంటబెట్టుకుని విగ్రహం చుట్టూ తిప్పింది.

మొండిగా వాదించిన ధీరసింహుడికి, విగ్రహానికి ఒకవైపు బంగారపు పూత కన్పించింది. విగ్రహం బంగారపుది అని వాదించిన శూరసింహుడికి వెండిపూత కన్పించింది.

ఆ దృశ్యం చూసినంతనే ఇద్దరూ తెల్లబోయి, ఒకరి వంక ఒకరు చూచుకోసాగారు. అంతలోనే ఆ యువతి అంతర్ధానమయింది.

ఆమె కోసం వారిద్దరూ ఆత్రంతో అటూ ఇటూ చూస్తుండగా, ఒక దిక్కు నుంచి ఇలా వినబడింది.

'యోధుల్లారా! నేనే శాంతి దేవతను. మీ ఇద్దరూ మహాయోధులే. మీ ఇద్దరి ఉద్దేశాలూ సరి అయినవే. కయ్యాలు మానండి. పౌరుషపడకండి. శాంతంగా జీవించండి!'

శూరసింహుడూ, ధీరసింహుడూ గుర్రాల మీది నుంచి దిగారు. ఒకరి నొకరు కౌగిలించుకున్నారు. డాలూ, కత్తులూ విగ్రహం ముందు పారవేశారు.

నాటినుండీ వారిద్దరూ వ్యవసాయ వృత్తి అవలంబించి, ప్రశాంతంగా జీవనం గడువసాగారు.





# లౌక్యం

ఉత్పల దేశాన్ని జయసేనుడు పాలించేవాడు. ఆ దేశపు ప్రధాన దౌత్యాధికారి హృద్రోగంతో హఠాత్తుగా మరణించడంతో, అతని స్థానంలో మరో వ్యక్తిని నియమించవలసిన అవసరం ఏర్పడింది. ఇరుగుపొరుగు దేశాలతో గల దౌత్య సంబంధాలను పర్యవేక్షించే ఉన్నత పదవి అది. అందుకు తెలివితేటలు, సమయస్ఫూర్తి, నేర్పు, ఓర్పు మున్నగు గుణగుణాలు కలిగియున్న సమర్థుడైన వ్యక్తి అవసరం. అలాంటి వ్యక్తి కోసం అన్వేషిస్తూ రాజ్యమంతటా ప్రకటించడం జరిగింది.

ఎందరో ఔత్సాహికులు ఆ పదవి కోసం పోటీ పడ్డారు. అభ్యర్థుల సంఖ్య అధికంగా ఉండడంతో వారికి వివిధ పరీక్షలు నిర్వహించారు. ఆ వడపోతలో చివరగా సుముఖుడు, అనఘుడు అనే ఇద్దరు అభ్యర్థులు వయసులో, విద్యలో, తెలివితేటలలో – అన్నిటిలోనూ సమ ఉజ్జీలుగా నిలిచారు. దాంతో వారిలో ఎవరిని దౌత్యాధికారిగా నియమించాలో తేల్చుకోలేని మహారాజు, నిర్ణయాన్ని మహామంత్రి సుధాముడికి వదిలేసాడు.

ప్రధానామాత్యుడు సుధాముడు మంచి అనుభవశాలి. ఎట్టి గడ్డు సమస్యనైనా ఇట్టే పరిష్కరించగల దిట్ట.

సుముఖుడు, అనఘుడులను సుధాముడు కలసి మాట్లాడాడు. తుది నిర్ణయం తీసుకోవడానికి మూడు రోజులు పడుతుందనీ, అంతవరకు వారిని తమ అతిథులుగా ఉండవలసిందనీ కోరాడు. ఇరువురికీ ప్రత్యేక గదులలో బస ఏర్పాటు చేసి వసతి సదుపాయాలు కల్పించాడు. వారి అవసరాలను కనిపెట్టి ఉండడానికి ఆ గదుల వద్ద రక్షక భటులను కూడా నియమించాడు.

ఆ మూడు దినాలూ సుముఖుడు, అనఘుడూ విడిదిలో షడ్రసోపేతమైన విందులతో ఆనందంగా గడిపారు. అంతేకాదు,

విశ్వమోహిని



వారిని రోజూ కొందరు రాజోద్యోగులు దర్శించి పరామర్శించి వెళ్లేవారు కూడాను.

నాలుగవ రోజున మహారాజు, మహామంత్రి కలిసి, మొదట అనఘుడి గదికి వెళ్ళారు. అతనికి అక్కడ సౌకర్యంగా ఉన్నదీ లేనిదీ విచారించాడు మహారాజు. మహామంత్రి ఆ మాటా ఈ మాటా అడుగుతుండగా, అతని చూపులు దేనికోసమో వెదికాయి.

ప్రశ్నార్థకంగా చూసిన అనఘుడిని 'ఇక్కడ ప్రభువుల చిత్రపటం ఉండాలి. ఇప్పుడది కనిపించడం లేదు. ఏమయింది?' అనడిగాడు. తాను ఆ గదిలో ప్రవేశించినప్పుడు అర చేత వెడల్పున ఉండే మహారాజు చిత్రపటం ఒకటి గూట్లో ఉండడం జ్ఞప్తికి వచ్చింది అనఘుడికి. అది ఎలా అదృశ్యమైందో తెలియ లేదు.

'నేను ఇక్కడకు వచ్చేసరికి మహారాజు గారి చిత్రపటం ఇక్కడ ఉన్న మాట వాస్తవమే. ఈ మూడునాళ్ళ లోనూ ఎవరెవరో ఇక్కడకు వచ్చి వెళ్లారు. వారిలో ఎవరో దాన్ని దొంగిలించి యుండవచ్చును' అని జవాబిచ్చాడు అనఘుడు.

అతని సమాధానానికి జయసేనుడు విస్తుపోయి చూస్తే, సుధాముడు నవ్వి 'పోనీలే. మరో చిత్రపటం తెప్పించి ఇక్కడ ఉంచవచ్చును' అన్నాడు అనఘుడితో.

అనంతరం మహారాజు, మహామంత్రి సుముఖుడి వద్దకు వెళ్ళారు. అతనితో సంభాషిస్తూనే, ఆ గదిలో ఉండవలసిన మహారాజు చిత్రపటం కూడా మాయమైనట్లు గ్రహించాడు సుధాముడు. -- అదే విషయం సుముఖుణ్ణి అడిగాడు.

తృటికాలం బిత్తరపోయాడు సుముఖుడు. గత దినం కూడా మహారాజు చిత్రపటాన్ని యధాస్థానంలో చూసాడు తను. ఇప్పుడు అది కనిపించకపోవడం ఖంగు తినిపించింది. అది ఏమైందో అతని ఊహకు అందలేదు. తన నిర్లక్ష్యానికి మహారాజు ఏమనుకుంటాడో ననిపించింది.

'మహారాజు చిత్రపటాన్ని ఎవరో దొంగిలించారని తెలుస్తోంది. అందుకు కారణం రక్షక భటుల ప్రమత్తతేనని మా అభిప్రాయం' అన్నాడు సుధాముడు చిరుకోపం నటిస్తూ.

సుముఖుడు గతుక్కుమన్నాడు. తన భావాలను బైటకు కనిపించకుండా జాగ్రత్త పడుతూ, 'మన్నించండి, అమాత్యవర్యా! చిత్రపటం చౌర్యానికి గురికాలేదు. ప్రభువుల పైన భక్తి గౌరవాలతో దాన్ని తమ పూజా మందిరంలో ప్రతిష్టించుకోవాలన్న కోర్కెను నిలువరించుకోలేకపోయారెవరో! ఇందులో రాజభటుల అలసత్వం అసలు లేదు' అని

సవినయంగా జవాబిచ్చాడు. ఆ జవాబుతో జయసేనుడి ముఖం వెలిగిపోవడం, సుధా ముడి దృష్టిని తప్పించుకోలేదు....

అనంతరం మహారాజు, మహామంత్రి అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు. కొద్దిసేపటి తరువాత సుముఖుడు, అనఘుడులకు మహారాజు నుండి పిలుపు వచ్చింది. తమలో ఎవర్ని ఎంపిక చేసారోనన్న ఉత్కంఠతో, కొలువుదీరియున్న జయసేనుడి ముందు హాజరయ్యారు ఇద్దరూ.

ఉత్పల దేశపు ప్రధాన దౌత్యాధికారిగా సుముఖుణ్ణి నియమిస్తున్నట్లు ప్రకటించాడు మహామంత్రి.

తన నిర్ణయానికి వివరణ ఇలా ఇచ్చాడు సుధాముడు. సుముఖుడు, అనఘుడు ఉన్న వసతి గదులలోని చిత్రపటాలని వారికి తెలియకుండా తన సిబ్బంది ద్వారా సుధాముడే మాయం చేయించాడు. వాటి అదృశ్యానికి వారు ఏం సంజాయిషీ ఇస్తారో వినాలన్నదే అందుకు కారణం. అనఘుడు ఇతరులకు చౌర్యం అంటగట్టి చేతులు దులిపేసుకున్నాడు. సుముఖుడు మాత్రం చతురతతో తిరుగులేని సమాధానం ఇచ్చాడు. మహారాజు పైన భక్తి గౌరవాలతో వారి చిత్రపటాన్ని పూజించడానికి ఎవరో తీసుకువెళ్ళారంటే హర్షించని వారు ఉండరు. అతను ఊహించినట్లే, అతని సమాధానం ప్రభువులను సంతృప్తుల్ని చేసింది. దౌత్యాధికారికి ప్రధానంగా కావలసినవి లౌక్యం, సమయస్ఫూర్తి. తాను నొవ్వక, ఇతరులను నొప్పించక, మాట్లాడే చతురత. విపత్కర స్థితిలో సైతం శాంతంగా ఆలోచించగలిగే మనస్తత్వం...

ఆ లక్షణాలన్నీ అనఘుడిలో కంటె సుముఖుడిలోనే ఎక్కువ ఉన్నాయి. అన్ని పరీక్షలలోనూ సమ ఉజ్జీలుగా నిలచిన ఆ ఇద్దరిలోనూ అత్యంత సమర్థుడైన వాణ్ణి కనుగొనేందుకే ఆ చిత్రపటపరీక్ష పెట్టాడు సుధాముడు.

మహారాజు జయసేనుడు మహా మంత్రి సుధాముడి వంక ప్రశంసాపూర్వకంగా చూస్తే, సభలో హర్షధ్వానాలు రేగాయి.

సుముఖుడు కృతజ్ఞతతో మహారాజుకు శిరసు వంచి నమస్కరించాడు. తరువాత ఆనందంతో అనఘుణ్ణి కౌగలించుకుంటే, మనస్ఫూర్తిగా అభినందించాడు అతను.





# ఉపచారం

కోదండపాణి ప్రముఖ వ్యాపారస్థుడు. బజారులో అంగడి గాక అతనికి గొప్ప భవనమున్నది. ఆ భవనంలో విద్యుద్దీపాలూ, పంకాలూ ఉన్నాయి. రాత్రిపూట కొట్టు మూసివేసి ఇంటికి రాగానే, రోజువారీ ఆదాయం ఎంతో తేల్చుకోవటానికని, డబ్బంతా కుమ్మరించి, నోట్లకు నోట్లు, చిల్లరకు చిల్లర వేటికవి విడమర్చి లెక్క పెట్టడం అతనికి మామూలు.

ఒకనాటి రాత్రి పదిగంటలకు అలానే రొఖ్ఖం లెక్కిస్తూవున్న సమయంలో, ఎవరో తలుపు తట్టి పిలిచినట్లయింది.

పిలుపు అందుకుని కూడా బదులు చెప్పకుండా ఉంటే బాగుండదు కద. అందుచేత కోదండపాణి పరిచి ఉన్న రొఖ్ఖం మీద రుమాలు కప్పి. గభీమని వెళ్లి తలుపు తీశాడు.

చూడగా, ఆ వచ్చినతను గురవయ్య. గురవయ్య కోదండపాణి ఆంతరంగికులలో ఒకడు. తనకు గల చనువును బట్టి అతను సరాసరి కోదండపాణి డబ్బు లెక్కిస్తున్న గదిలోకే వచ్చేశాడు.

కుశల ప్రశ్నలయినై. తరువాత 'గురవయ్య మామా! నాకు ఇప్పుడొక పెద్ద చిక్కు వచ్చిపడింది. ఎలా ఐనా ఒక్క పాతిక రూపాయలు సర్దుబాటు చేయాలి', అని అడిగాడు.

కోదండపాణి ఆలోచనలో పడ్డాడు. -- తన వ్యాపారపు చిక్కులూ, డబ్బు ఇబ్బందులూ, అన్నీ పూసగుచ్చినట్లు, మనసుకు నచ్చేటట్టు విప్పి చెప్పాడు చాలాసేపు.

'అలాకాదు, ఎంత వడ్డీకైనా సరే. ఎక్కడినుంచి ఐనా సరే, తెచ్చిపెట్టక తప్పదు,' అంటూ బలవంతపెట్టసాగాడు గురవయ్య.

డి. నారాయణ స్వామి

మాట తీసెయ్యడానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది కోదండపాణికి. ఇదిలా ఉండగా, వాళ్లిద్దరూ ఇలా ప్రసంగించుకుంటూ ఉండగానే ఆకస్మికంగా విద్యుద్దీపం ఆరిపోయి, గది అంతా చిమ్మచీకటి ఐపోయింది.

వెంటనే కోదండపాణి ఆప్యాయంగా గురవయ్య చేతులు రెండూ పట్టుకొని, 'మామా! మరేమీ అనుకోవద్దు సుమా, నీ వంటివాడు ఈ రాత్రివేళ వస్తే మాట దక్కించలేకపోయాను కదా.. అని మనసులో ఎంతో బాధగా ఉంది', అని సానుభూతితో మాటలు సాగించాడు.

'పైగా రాకరాక వచ్చావు. భోజనం చేసి వెళుదువు గాని', అంటూ కోదండపాణి గురవయ్యను రెండు చేతులూ పట్టుకుని బతిమలాడసాగాడు. 'అహ-వద్దు, వద్దు, వెళ్ళొస్తాన'ని గురవయ్య అంటే, కోదండపాణి ఇంకా బలవంతపెట్టాడు.

అంతలో గుప్పుమని దీపం వెలిగింది. ఇదేమిటా గొడవ చూదామని ఇంటావిడ అక్కడికి వచ్చింది. ఆ మట్టున కోదండపాణి గురవయ్య చేతులు విడిచిపెట్టి, 'ఐనా, గురవయ్య మామా! మేము కోరటమే కాని, మాలాటి వాళ్ల ఇళ్లలో మీరు భోంచేస్తారా! సరేలే, కానీ..' అని తేలికగా అనేశాడు.

గురవయ్య సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. 'వాడిని భోజనానికి ఉండమని ఎందుకండీ అలా బతిమిలాడుతున్నారూ?' అని కోపంతో అడిగింది కోదండపాణి భార్య.

అందుకతడు 'ఓసి అమాయకురాలా! వాడినెవడు ఉండమంటాడు, ఈ అపరాత్రి వేళ భోజనానికి! దీపం ఆరిపోవటం చేత, వాడు డబ్బు కాజేసిపోతాడేమోనని ఇంత నాటకం ఆడవలసి వచ్చింది,' అని సమాధానం చెప్పాడు.

భర్త తెలివితేటలకూ, సమయోచితమైన యుక్తికీ చాలా సంతోషించింది కోదండపాణి భార్య.





# ఇద్దరు విద్వాంసులు

శిఖ్ఖులకు మహాప్రవక్త ఐనటువంటి గురు నానక్ సంగీత ప్రియుడు. దేవుడిమీద ధ్యానం కుదరటానికి మధురమైన సంగీతమే మంచి సాధనమని నమ్మినవాడు. అందుచేత నానక్ భక్తిభరితమైన గానం చేసి, తరుణోపాయం పొందాలని నిశ్చయించుకున్నాడు.

తన మతప్రచారం కోసం నానక్, రోజుకొక ప్రదేశం సంచారం చేస్తుండేవాడు. ఆ సంచారంలో ఆయనకు సంగీతం వినిపించటానికని భాయ్ మార్దాన అనే గొప్ప విద్వాంసుడు వెంటనుండేవాడు.

మార్దాన ఎంతో చక్కగా ప్రజల ఎదుట భక్తికీర్తనలను పాడి, వినేవారికి తన్మయత కూర్చేవాడు.

గురునానక్ ఏర్పరిచిన ఈ సంప్రదాయాన్ని శిఖ్ఖు గురువులందరూ అనుసరిస్తూ వచ్చారు. గురువులలో ఐదవవాడైన అర్జునదేవ్ తరంలో, ఆయన వద్ద శాంత, బల్వంత అనే ఇద్దరు విద్వాంసులు ఉండేవారు. ఆ ఇద్దరూ అన్నాదమ్ములే.

ఇద్దరూ చాలాకాలం వారి గానమాధుర్యంతో గురుదేవుడైన అర్జున్‌దేవ్‌నూ, భక్తులందరనూ మెప్పించి, ఆదరణ పొందారు.

ఇలా ఉండగా కొంత కాలానికి విద్వాంసులైన శాంత, బల్వంతులకు పెళ్లాడుదామని బుద్ధి పుట్టింది. పెళ్లి చేసుకోవడమంటే మాటలా? బోలెడంత డబ్బుకావాలి. సరే, సోదరులిద్దరూ ఒకనాడు గురువు వద్దకు వెళ్లి, వారి కోరికను వెల్లడించారు. ధన

హరిలాల్

సహాయం కోరారు. ఈ మాట విని అర్జున దేవ్ చాలా సంతోషించాడు.

'ఇంతకంటే నాకు కావలిసిందేమిటి? తప్పక సాయం చేస్తాను. మీకు ఎంత ధనం కావాలో చెప్పండి', అన్నాడు గురుదేవ్. అందుమీదట వారిద్దరూ కూడబలుకు కొని, 'గురూజీ! ఈ రోజు సాయంకాలం భజనసమయంలో భక్తులు అర్పించే ధనం ఇస్తే మాకు సరిపోతుంది'. అన్నారు.

వారి కోరిక ప్రకారం, ఆనాటి సాయంత్రం భక్తుల వల్ల పోగైన కానుకలను గురుదేవ్ వారికిచ్చాడు. చూడగా, ఆనాడు పోగైన ధనం చాలా కొద్దిగా ఉన్నది. 'ఈ గురుదేవ్ కావాలనే ఇలా చేసి ఉంటాడు. ముందుగా, ఏదో ఏర్పాటు చేయడం వల్లనే ఇవాళ ఇంత స్వల్పధనం పోగయింది. లేకపోతే ఏమిటి?' అని ఆపోహపడి, వాళ్ళిద్దరూ చిరచిరలాడుతూ భజనకూటం నుండి లేచి వెళ్లిపోయారు. మరునాడు మామూలు వేళకు శాంత, బల్వంతులు భజనకు రాలేదు. అర్జునదేవ్ వారికి కబురంపాడు. 'ససేమిరా, రాము' అన్నారు వాళ్లు. అలా అని ఊరుకోలేదు. 'మేము చేసే మధురగానం వల్లనే భజనకు ఇంతమంది జనం వస్తున్నారు. మావల్లనే గురువుకూ ఖ్యాతి వస్తున్నది. ఇప్పుడే కాదు. మొట్టమొదటి శిఖ్ఖు గురువైన నానక్ కూడా, తన సంగీత




విద్వాంసుడైన భాయ్ మార్దన్ వల్లనే యశస్సు ఆర్జించాడు', అన్నారు.

ఈ అప్రస్తుత ప్రసంగానికి, అర్జున్‌దేవ్ చాలా ఖేదపడ్డాడు. వెంటనే తను శాంత, బల్వంతుల ఇంటికి స్వయంగా వెళ్ళి పిలిచాడు. కాని వాళ్లు గురువుకు కూడా అంతే సమాధానం ఇచ్చారు. మహామహుడైన గురునానక్‌ను కించపరుస్తూ మాట్లాడటంతో, ఆ సోదరుల మీద అర్జున్‌దేవ్‌కు కోపం వచ్చింది.

'దేవుని స్తుతించడానికి వినియోగించని మీ సంగీత విద్య మీకు పనికిరాకపోవుగాక', అని శపించివేశాడు. గురుదేవుని వాక్శుద్ధివల్ల అప్పటినుంచీ ఆ సోదరులకు

నాలుకలు స్వాధీనం తప్పినై. వాళ్లు యాతన పడ్డారు. తిండి నోటికి పోవటం కూడా కష్టమైపోయింది.

అక్కడ అర్జున్‌దేవ్, భజనకు వచ్చిన వారందరితో 'నిశ్చల భక్తితో దైవ ప్రార్థన చేయండి. మీమీ ఇష్టమైన వాద్యాలు చేత పట్టుకుని కీర్తనలు పాడండి'. అని ఆదేశించాడు. ఆ మాటలతో అక్కడ సమావేశమైన అందరూ ఒక్కొక్కరు ఒక్కొక్క వాద్యాన్ని తీసుకుని, గొంతెత్తి భగవన్నామస్మరణ ప్రారంభించారు. అక్కడ సంగీతం ఏమీ చేతకాని వాడు సైతం ఎంతో అద్భుతంగా, అనుభవజ్ఞుడిలాగా పాడగలిగాడు. ఎప్పుడూ చూచి ఎరుగని వాద్యాలు కూడా వారు ఎంతో చక్కగా వాయించగలిగారు.

కొంతకాలానికి శాంత, బల్వంతులు తమ తప్పు తెలుసుకున్నారు. గురుదేవుని ఎదట పడటానికి మొహం చెల్లక, స్నేహితుల ద్వారా క్షమాపణ చెప్పుకున్నారు. అందుకు గురుదేవుడు ఉగ్రుడై,

'భగవంతుడు ప్రసాదించిన కంఠ మాధుర్యాన్ని, భగవంతుని కోసం పాడే గీతాలకు వినియోగించడానికి నిరాకరించిన వాళ్లకు క్షమాపణ ఏమిటి? ఇటుపైన ఈ విషయంలో నాతో మాటాడటానికి ఎవరైనా వస్తే అలాంటి వారి ముఖానికి మసిపూసి గాడిదను ఎక్కించి ఊరేగింపు చేయిస్తా,' అన్నాడు.

అర్జున్ దేవ్ ఇలా అనేసరికి, ఎవళ్లూ ఎదటికి వెళ్లలేకపోయారు. ఏమీ లాభం



లేదని తేలిపోగానే, శాంత, బల్వంతులు లాహోరు పోయి లాధాజీ అనే మహాను భావుని శరణు చొచ్చారు. లాధాజీ ఆ ప్రాంతంలో పేరు పొందిన పరోపకారి. పరోపకృతి కోసం ఎంతటి త్యాగాన్నయినా చేయగల పుణ్యాత్ముడు. ఆ సోదరులు పోయి తమకు కలిగిన పరాభవం చెప్పుకో గానే, లాథాజీకి కరుణ కలిగింది. 'సరే, మీరు వెళ్లండి. నేను కనుక్కొంటాను', అని చెప్పి వాళ్లను పంపించివేశాడు.

వాళ్లు వెళ్లగానే లాథాజీ ముఖమంతా మసి పూసుకుని, గాడిదనెక్కి ఊరేగుతూ, అర్జున్‌దేవ్ వద్దకు బయలుదేరాడు. లాథాజీ అమృతసర్ చేరుకునేకల్లా గొప్ప కోలాహలం ప్రారంభమయింది. పురుషులు, స్త్రీలు, పిల్లలు గుంపులు గుంపులుగా చేరి పెద్ద గోల చేయసాగారు. ఇదేమిటా హడావుడి అని కనుక్కోగా, ఆ వేషంతో వస్తున్న లాథాజీని చూసి అందరూ ఆశ్చర్యపోయినట్లు తెలియవచ్చింది. వీధులలో ఊరేగుతున్న ఆ మహానుభావుణ్ణి, ఈ రూపంలో చూడ గానే ప్రజలు విస్మయంతో, పోయి గురు దేవునితో చెప్పారు.

అందరితోపాటు.. అర్జునదేవునకూ ఆశ్చర్యం కలిగింది. లాథాజీ కనబరిచిన పరోపకారబుద్ధికి ఎంతో సంతోషించాడు. ఆయనకు దర్బారులో సమస్తమైన మర్యాదలూ చేసి, శాంత, బల్వంతులను క్షమించి లాథాజీని సంతోషపెట్టాడు.

ఆనాటి నుంచీ శాంత, బల్వంతులు బుద్ధి తెచ్చుకుని, వారి సంగీత ప్రజ్ఞను దైవ సంకీర్తన కోసమే వినియోగించి, ధన్యుల య్యారు, నాటినుంచి మహానుభావుడైన లాథాజీకి, పరోపకారీ అనే బిరుదు సార్థకమై నిలిచింది. శాంత బల్వంతులలో గొప్ప పరివర్తన కలిగింది.






# ఆరుగురు వైద్యులు

ధవళపురం అనే పట్టణంలో దేవగుప్తుడనే ధనిక వర్తకుడుండేవాడు. పట్టణంలో అతడికి చాలా వ్యాపారాలుండేవి.

ఆ ఒత్తిళ్ళు, ఒడిదుడుకులతో క్షణం తీరిక లేకుండా ఉండే అతడికి ఎన్నోశారీరక రుగ్మతలు పట్టి పీడిస్తూండేవి. వైద్యులు చికిత్స చేస్తున్నా ఫలితం లేకుండా పోయింది.

ఈ విషయం స్నేహితుడొకడితో ప్రస్తావించినపుడు అతడు 'అనంతభట్టుకి చూపించలేదా? ఆయనకూడా బాగు చెయ్యలేకపోతున్నాడా?' అని అడిగాడు.

దేవగుప్తుడు అతడెవరని అడగ్గా, అందుకా స్నేహితుడు-- 'అనంతభట్టు పట్టణానికి కొంచెం దూరంలో ఉన్న తన మామిడి తోటలో కుటీరం వేసుకుని ఉంటున్నాడు. అక్కడే తన దగ్గరికి ఎవరైనా వస్తే వైద్యం చేస్తాడు' అన్నాడు. దేవగుప్తుడు అలాగే అంటూ సేవకుడొకడిని పిల్చి అనంతభట్టును పిలుచుకురమ్మన్నాడు. సేవకుడు వెళ్ళి తిరిగి వచ్చి అనంతభట్టు రాసిచ్చాడంటూ ఒకచీటీని ధనగుప్తుడికిచ్చాడు.

అందులో 'తమబోటి ప్రముఖులకి వైద్యం చేసే అవకాశం వస్తుందని సంతోషంగానే ఉన్నా, వైద్యుడిగా నాకు కొన్ని పద్ధతులు ఉన్నాయి. నాచేతి వైద్యం కావాలనుకున్నవారు, ఎంతటి వారైనా, బొత్తిగా కాలూ చెయ్యి కదపలేని స్థితిలో లేనంత కాలం, స్వయంగా తమకు తామే నా దగ్గరకు వైద్యానికి రావాల్సి ఉంటుంది. తమకి అభ్యంతరం లేకపోతే, రేపు సూర్యోదయంకాగానే నడుచుకుంటూ మాతోటకి రండి', అని రాసి వుంది.

ధనగుప్తుడు ఇష్టం లేకపోయినా ఆ మరునాడు అనంతభట్టు చెప్పినట్లే అతడి కుటీరానికి నడుస్తూ బయలుదేరి వెళ్ళాడు. అతణ్ణి చూడగానే అనంతభట్టు 'పొద్దున్నే ఇంత

జొన్నలగడ్డ రత్న

దూరం మిమ్మల్ని రప్పించాను. శ్రమ కలుగ లేదు కదా' అన్నాడు.

ధనగుప్తుడు 'బయలుదేరేముందు నేను కూడా అలాగే ఉంటుందేమో అనుకున్నాను. ఇన్నేళ్ళలో యిలా ప్రొద్దుటే లేచి దూరంగా నడిచిపోవడం ఎప్పుడూ జరగలేదు. నీరెం డలో నడిచి వస్తుంటే బాగానే ఉన్నదనిపిం చింది. నాకు చాలా తొందరపనులున్నాయి. మీ వైద్యమేదో ప్రారంభించండి... తిరిగి వెళ్ళాలి' అన్నాడు.

అనంతభట్టు 'అయితే ముందుగా మీరో పని చెయ్యాలి, కాలకృత్యాలేవైనా మిగిలి వుంటే ముగించుకుని, తోట నానుకుని ప్రవ హిస్తున్న ఆ కనపడే ఏటిలో స్నానం చేసి రండి'. అన్నాడు. అసహనంగానే ధనగుప్తుడు ఏటివైపు నడిచి వెళ్ళాడు.




స్నానం చేసి తిరిగి వచ్చాక, అనంతభట్టు అతణ్ణి 'పరిచారికల చేత వేడినీళ్ళతో పన్నీటి స్నానాలు చేసే మిమ్మల్ని యిలా చన్నీళ్ళలో మునిగి రమ్మని యిబ్బంది పెట్టాను కదూ', అన్నాడు.

ధనగుప్తుడు 'ఇబ్బంది ఏమైనా ఏటి నుంచి వస్తున్న పిల్లగాలీ, ఆ నీళ్ళలో వున్న చల్లదనం ఏదో కొత్త అనుభవం లాగే వుంది' అన్నాడు.

అనంతభట్టు 'పదండి, కొద్దిగా ఉపా హారం తీసుకుని ఆపైన తీరిగ్గా కూర్చుని వైద్యం గురించి మాట్లాడుకుందాం', అంటూ ధనగుప్తుడుని కుటీరం లోపలికి ఆహ్వానిం చాడు.

అక్కడ వారికి అనంతభట్టు భార్య, రెండు కంచాలలో వంటకాలను వడ్డించి తెచ్చి ముందుంచింది. కంచంలోకి ధనగుప్తుడు ఆశ్చర్యంతో చూస్తుంటే... అనంతభట్టు, 'మృష్టాన్నాలూ, మధుర పానీయాలతో మూడు పొద్దులా భోజనం చేయగల స్థోమత ఉన్న మీకు ఏదో గడ్డీగాదం తినిపిస్తున్నా ననుకోకండి. ఇక్కడికి వచ్చేవారికెవరికైనా మా తోటలో దొరికేవాటినే వండి తినిపించి వడ్డిం చడం నా భార్య సంప్రదాయంగా పెట్టుకుంది', అంటూ నవ్వాడు.

ధనగుప్తుడు కంచంలో ఉన్నదంతా తిని, మందహాసం చేస్తూ 'నిత్యం విందుభోజనా లతో, పానీయాలూ, ఫలహారాలతో తిండంటే మొహం మొత్తే స్థితికి వచ్చాను. పెట్టింది కొంచెమైనా బాగానే ఉన్నది. మందేమోననే మొహమాటంతో మారడగలేదు', అన్నాడు.

తరువాత వాళ్ళిద్దరూ కలిసి-- తోటలో మామిడి చెట్టు కింద వేసి ఉంచిన ఉయ్యా లలో కూర్చున్నారు. ధనగుప్తుడు, 'నాకు ఎన్నో

పనులున్నాయని ముందే చెప్పాను. చికిత్స గురించి మాట్లాడకూడదూ'? అన్నాడు.

అనంతభట్టు అతడికి శరీరధర్మాల గురించి, వచ్చే వ్యాధుల గురించి చెప్పడం మొదలెట్టగానే, ధన గుప్తుడు ఉయ్యాలలో ఊగుతూ, వింటున్న వాడు వింటున్నట్లు గానే సన్నని కునుకులోకి జారుకున్నాడు. కొంచెం సేపయ్యాక అతడు ఉలిక్కిపడి లేచి, 'క్షమించండి, అనుకోకుండా కునుకుపడు తోంది. నిద్రలేమి రోగమున్న నాకిలా జర గటం నాకే ఆశ్చర్యంగా ఉంది. చేయబోయే చికిత్స గురించి మరి చెబుతారా'? అన్నాడు.

అనంతభట్టు నవ్వుతూ, 'మీకు చికిత్స ఎప్పుడో మొదలైంది. వైద్యులైన నా ఆరు గురు శిష్యులు ఇప్పటికే మీకు అది ప్రారం భించారు', అన్నాడు.

దేవగుప్తుడు ఆశ్చర్యంగా– 'ఆరుగురు వైద్యులా, ఎక్కడు వారు? నాకెక్కడా కనబ డరేం? నాకు వారు చికిత్స చేయడమేంటి? వింతగా ఉంది', అన్నాడు.

అందుకు అనంతభట్టు, 'సూర్యరశ్మి, చక్కటి గాలి, చల్లని నీరు, వ్యాయామం, మితాహారం, విశ్రాంతి వీటన్నింటి కన్నా మించినవైద్యులు మరొకరు ఈ ప్రపంచంలో లేరు. వెయ్యి వ్యాపకాలూ, ఒత్తిళ్లమధ్య ఉండే మీరే కాదు, మీలాంటి వారెందరో వీటిని పట్టించుకోరు. ఇది నాకు తెలుసు. అందుకే బారెడు పొద్దెక్కినా లేవని మిమ్మల్ని సహజమైన చల్లగాలిలో సూర్యరశ్మి మీద పడుతుంటే నడిచి రమ్మన్నాను. చన్నీటి స్నానం చేయించాను. మితంగా తినిపిం చాను. ఈ అనుభవాలన్నీ బాగానే ఉన్నా యని మీరే అన్నారు కదా! అందుకే మీకు నిజమైన విశ్రాంతి లభించింది. నిద్రరావడం కూడా మొదలైంది.

ఈ ఆరుగురి వైద్యుల వైద్యం బాగున్నది కదా! అవసరమైతే ఏడో వైద్యుణ్ణి నేనుండనే ఉన్నాను', అన్నాడు.

ధనగుప్తుడు అనంతభట్టుకి నమస్క రించి, 'అంతా అర్థమయింది. ప్రస్తుతానికి నాకు మీ ఆరుగురు వైద్యులు చేసే వైద్యం చాలు. ఏడో వైద్యుడిని కలిసే అవసరం ఇప్పట్లో రాకుండా చూసుకుంటాను', అంటూ వెళ్ళిపోయాడు.






# తోబుట్టువు

మధ్యాహ్న భోజనానికి బడి గంట మోగేస రికి పిల్లలంతా కబుర్లు చెప్పుకుంటూ భోజనం డబ్బాలతో మైదానంలోకి చేరుతు న్నారు.

చిన్నారి చేతిలో ఓ అందమైన రాఖీ పట్టుకుని స్కూలు ఆవరణలోని పారి జాతం చెట్టు కింద విచారంగా నిలబడి దూరంగా కిలకిల్లాడుతూ కబుర్లు చెప్పు కుంటున్న తన స్నేహితుల్ని చూసింది. తర్వాత వెక్కివెక్కి ఏడవటం మొదలెట్టింది.

ఇంతలో ఎవరో చెవిలో చెబుతున్న ట్టుగా 'చిన్నారీ.. ఎందుకేడుస్తున్నావు తల్లీ!' అని పిలుస్తున్నట్టు వినబడటంతో చిన్నారి ఏడుపు ఆపి ఆశ్చర్యంగా అటూ ఇటూ చూసింది.

చుట్టుపక్కల మనుషులెవరూ కనిపిం చలేదు. 'ఎవరు నన్ను పిలుస్తున్నారు? ఎవరూ కన్పించడం లేదే.. అమ్మో నాకు భయమేస్తోంది,' అంది చిన్నారి బెదురుగా.

'భయపడకమ్మా చిన్నారీ.. ఒకసారి మళ్లీ తల పైకెత్తి చూడు.. నేను పారిజాతం చెట్టును. నువ్వు నా ఒళ్లోనే కూర్చున్నావు చిన్నారీ!' అనేసరికి ఆ చెట్టుకేసి వింతగా చూసి తను ఎందుకేడుస్తుందో కూడా మర్చి పోయి 'అరె... చెట్టు మాట్లాడుతోందే..' అంది చిన్నారి గుండ్రంగా కళ్లు తిప్పుతూ.

'అవును చిన్నారీ! చెట్టునే మాట్లాడు తున్నాను.'

'నీకు నోరు లేదు కదా! ఎలా మాట్లాడు తున్నావు?' అంది చిన్నారి ఆత్రంగా చెట్టు కేసి చూస్తూ...

'మీలాగా మాకు నోరులేకపోయినా మేము నడవలేక పోయినా మాకూ ప్రాణ ముంటుంది కదా చిన్నారీ! మీరు విడిచి

పి.వి. శేషారత్నం




పెట్టిన బొగ్గుపులుసు వాయువును పీల్చుకుని మీకు ప్రాణవాయువును ఇచ్చి మీ పర్యావరణాన్ని చల్లబరిచి మీకూ, ప్రకృతికి కూడా మేము మిత్రులమయ్యాము. మీ కష్టసుఖాల్లో పాలు పంచుకునే తోబుట్టువులం కూడా... ఇంతకీ నువ్వెందుకు ఏడుస్తున్నావో చెప్పుమరి,' అంది లాలనగా చెట్టు.

చిన్నారికి మళ్లీ ఏడుపు గుర్తొచ్చింది. గద్గద కంఠంతో 'ఇవాళ రాఖీపండగ... అదిగో నా స్నేహితులంతా వాళ్ల అన్నలకూ తమ్ముళ్ళకూ రాఖీలు కట్టి వాళ్లిచ్చిన కానుకలు తీసుకుని ఎంత ఆనందంగా ఉన్నారో?' అంది. 'మరి నువ్వు కూడా మీ అన్నయ్యకో తమ్ముడికో కట్టొచ్చుగదా!' అంది చెట్టు.

'అదే కదా నా బాధ.. నాకు అన్నదమ్ములెవరూ లేరు.' అంది చిన్నారి విచారంగా.

'అరెరే. నీలాంటి పిల్లలు ఎప్పుడూ సంతోషంగా ఆడుతూ పాడుతూ నవ్వుతూ ఉంటేనే బాగుంటుంది. రోజూ మధ్యాహ్నం భోజనాలు చేస్తూ కిలకిలా నవ్వుతూ మీరు తెచ్చుకున్నవి పంచుకుంటూ తింటూంటే నేనెంత సంతోషిస్తుంటానో తెలుసా?'

'నీ సంతోషం సంగతి సరే.. మరి నా రాఖీ సంగతేమిటి?'

'ఇంతకీ రాఖీ తెచ్చావా? ఏదీ నాకు చూపించు..' అంది చెట్టు.

'ఇదిగో... ప్లాస్టిక్ వాడకూడదని మా మాస్టారు మొన్న పాఠంలో చెప్పారని మా స్నేహితులందరిలాగా నేను కూడా మా టైలర్ దగ్గరకెళ్లి... అక్కడ కుట్టగా మిగిలిపోయిన రంగురంగుల గుడ్డముక్కలతో ఎంత అందంగా రాఖీ తయారు చేశానో చూడు...' అని తన రాఖీని చూపించింది చిన్నారి.

పారిజాతం చెట్టు ఎంతో ఆనందంగా, 'చిన్నారీ ఆ గుడ్డ ముక్కలు మా చెట్లు ఇచ్చిన పత్తినుంచి తయారు చేసినవే కదా. అందుకే కాబోలు ఈ రాఖీ ఎంత బావుందో చూశావా?'

'కాని ఇది కట్టేందుకే నాకెవరూ లేరు కదా!' అంది బాధగా చిన్నారి.

పారిజాతం చెట్టు నవ్వుతూ 'నేనున్నాగా? నేనే నీ అన్ననుకో..' అనేసరికి చిన్నారి సంతోషంగా గంతులేస్తూ 'భలే భలే ఇది చాలా బావుందే. ఉండు నీకే కడతాను.. రాఖీ పండగనాడు ఇన్నాళ్లకి నాకో మంచి అన్నయ్య దొరికాడు...' అని

రాఖీని చెట్టు మొదలుకి కట్టేందుకు ప్రయత్నించింది. అయితే చెట్టు మొదలు చాలా లావుగా ఉంది. చిన్నారి తెచ్చిన రాఖీ చిన్నదయిపోయింది.

ఎంత ప్రయత్నించినా అది కట్టడానికి సరిపోకపోయేసరికి చిన్నారి విచారంతో 'అయ్యో ఇది సరిపోవడం లేదే.. ఎలా..' అని ఆలోచనలో పడింది. చెట్టు కూడా చిన్నారి తనకి రాఖీ ఎలా కడుతుందా అని కుతూహలంతో చూస్తోంది.

ఇంతలో దూరంగా కబుర్లాడుతున్న పిల్లలంతా బిలబిలమంటూ అక్కడికి పరిగెత్తుకొచ్చారు.

'చిన్నారీ! రోజూ మనమంతా కలిసే భోజనం చేస్తాం కదా! ఇందాకటి నుంచి నువ్వెక్కడున్నావా అని వెతుకుతూ దూరం నుంచి ఈ చెట్టుకింద నిన్ను చూసి వచ్చాం. రా భోజనం చేద్దాం,' అన్నారు.

'ముందు మా చెట్టు అన్నయ్యకి రాఖీ కట్టనివ్వండి,' అంది చిన్నారి మళ్లీ చెట్టు మొదలుకు రాఖీ కట్టడానికి ప్రయత్నిస్తూ.

'ఓహో, నీకూ ఓ మంచి అన్నయ్య దొరికాడన్నమాట మరింకేం? ఇదిగో మేం తెచ్చిన రాఖీలు కూడా ఉన్నాయిగా.. మేమూ నీకు సాయం చేస్తాం... ఇవన్నీ కలిపి పెద్ద రాఖీని తయారు చేద్దాం...' అంటూ వాళ్లంతా అందరి రాఖీలను కలిపి కట్టేసరికి అందమయిన రంగురంగుల పెద్ద రాఖీ తయారయింది.

స్నేహితుల సాయంతో చిన్నారి తన తోబుట్టువు అయిన పారిజాతం చెట్టుకి ఆనందంగా రాఖీ కట్టింది.

'మన స్నేహితురాలు చిన్నారికి వాళ్ల అన్నయ్య ఏం బహుమతి ఇస్తాడో చూద్దాం,' అన్న చిన్నారి స్నేహితుల మాటలు పూర్తి కాకుండానే పారిజాతం చెట్టు 'సుఖీభవ..' అని దీవించి జలజలా పువ్వులను రాల్చింది.

పిల్లలంతా సంబరంగా 'చిన్నారీ.. మీ చెట్టు అన్నయ్య ఎంత మంచివాడో..? మనకి పారిజాతం పూలు బహుమతిగా ఇచ్చాడు.' అంటూ సంతోషంతో తెగ గంతులు వేశారు.



# ఎవరు పెద్ద?

హిమాలయ పర్వత ప్రాంతంలో ఒక పురాతనమైన మర్రి చెట్టు ఉండేది. దానిమీద ఒక చకోరపక్షి, ఒక కోతీ ఉండేవి. చెట్టు కింద ఒక ఏనుగు నివసిస్తూ ఉండేది. మూడూ ఒక చోటనే ఉంటూ కూడా ఎప్పుడూ తమలో తాము కీచులాడుకుంటూండేవి.

ఇలా కీచులాడటం వాటికే భావ్యంగా కనిపించలేదు. అందుచేత అవి, తమలో ఎవరు వయసులో పెద్ద అయినదీ తేల్చుకుని, వారు చెప్పిన ప్రకారం మిగిలిన ఇద్దరూ వినే టందుకు నిశ్చయించాయి. కాని వయసులో ఎవరికన్న ఎవరు పెద్దో తేల్చుకునేదెలా?

'నాకు ఊహ వచ్చేనాటికి నేను ఈ మర్రి చెట్టుమీద నిలబడితే దీని తల సరిగా నా పొట్టకు తగులుతుండేది' అన్నది ఏనుగు. 'ఈ చెట్టు ఇంకా చిన్నదిగా ఉండగా నేనెరుగుదును. నేను నేలమీద కూచుని, నోటితో ఈ చెట్టుపై చిగుళ్లు అందుకునేదాన్ని' అన్నది కోతి.

'తమ్ముళ్లారా, ఇక చెప్పకండి. ఇక్కడికి కొంతదూరంలో మరొక పెద్ద మర్రిచెట్టు ఉండేది. నేను దాని పండు తిని ఇక్కడ రెట్ట వెయ్యగా ఈ మర్రి మొలిచింది', అన్నది చకోరపక్షి.

ఆనాటినుంచి చకోరపక్షి చెప్పినట్టు ఏనుగూ, కోతీ వినసాగాయి. వాటిలో వాటికి పోరు లేకుండా పోయింది.

– చందమామ





# శిథిలాలయం – 17

*(శిథిలాలయ పూజారి తన బంటు సవరభేరుండం సాయంతో, నాగుమల్లిని అపహరించి, పారిపోయాడు. అరణ్యంలో శిఖిముఖి, పూజారికి గుర్రాన్ని అమ్మి సాయపడిన దొంగలు కనిపించగా, వాళ్లను వెన్నంటి పోయాడు. శివాలుడూ, గండుపోతూ, లోయలోకి వచ్చారు. వారికి దూరం నుంచి ఎవరో ఈలవేస్తున్న ధ్వని వినిపించింది. తరవాత–)*

శివాలుడు దివిటీ వెలుగుకేసి, ఓ క్షణకాలం చూసి.., తన అనుచరులతో, 'దివిటీని గాలిలో అల్లల్లాడిస్తున్న వాడెవడు?' 'ఆ ఈల లోగడ ఎక్కడో విన్నట్లున్నదే', అన్నాడు ఆశ్చర్యపడుతూ.

అప్పుడు శబరుల్లో, ఒకడు శివాలుడితో, 'దొరా, ఆ దివిటీ కనబడుతున్న చోటున బడేచెంచు వేటకు వచ్చినప్పుడు విశ్రాంతి తీసుకునే పాక ఒకటి ఉన్నది. చీకటి పడేవేళ నేను అటునుంచే వచ్చాను. ఆ సమయంలో ఎవరూ అక్కడ లేరు,' అన్నాడు. దివిటీని శివాలుడూ వాళ్లున్న వైపుకు రమ్మన్న సూచనగా పైకీ కిందికీ ఊపుతూ, వాడెవడో మరింత బిగ్గరగా ఈల వేయసాగాడు. శివాలుడు, గండుపోతుతో మాట్లాడి, అనుచరులతో, 'వాడెవడో గాని మననే పిలుస్తున్నట్లున్నది. పోదాం పదండి' అంటూ బయలుదేరాడు.

శివాలుడూ వాళ్లూ పాకను సమీపించేంతలో, దివిటీ పట్టుకున్నవాడు ఈలలు వేయటం మాని పాక లోపలికి వెళ్లిపోయాడు. శివాలుడు పాకను సమీపించి చూసేసరికి, దాని వెదురుకర్రల తలుపు మూయబడి ఉన్నది. లోపల వెలుగుతున్న

దాసరి సుబ్రహ్మణ్యం



శివాలుడు నిర్విణ్ణుడయిపోయాడు. సవర గండుపోతు పెద్దగా హుంకరించి కత్తి ఝుళి పిస్తూ పూజారికేసి దూకబోయాడు.

శివాలుడు, గండుపోతును భుజం పట్టుకుని ఆపి, 'తొందరపడకు పోతూ, మన చేతిలో చిక్కిన ఈ దుష్టుడు మరెక్కడికీ పారిపోలేడు' అన్నాడు.

గండుపోతు ఆ మాటలతో కాస్త శాంతిం చాడు. కాని, అతడి కళ్లు నిప్పులు చెరుగు తున్నవి. ఏమాత్రం వీలు దొరికినా పూజా రిని కత్తితో రెండుగా నరకాలన్న ఉద్రేకంలో ఉన్నాడతను.

శివాలుడు, శిథిలాలయ పూజారిని సమీపించి, 'మా అందరికీ ఎంతో కష్ట నష్టాలు కలిగించటమే గాక, సవరపెద్ద కుమార్తెను కూడా నువ్వు అపహరించుకు పోయావు. అలాంటి నువ్వు ఇంత ధైర్యంగా మా మధ్యకు రావటం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది' అన్నాడు.

శిథిలాలయ పూజారి ఆ మాటలకు వికవికమంటూ నవ్వి, 'నువ్వు గండుపోతు కన్న ఎన్నో రెట్లు వివేకవంతుడివి, నా శక్తిసామర్థ్యాలు ఎలాంటివో ఇప్పటికి నీకర్థ మైనదనుకుంటాను' అన్నాడు.

పూజారి నవ్వూ, అతడి మాటల వెనక ఉన్న అవహేళనూ చూసి శివాలుడు మండి పడి, ఒక్క అంగలో అతణ్ణి సమీపించి మెడ గట్టిగా పట్టుకుని, 'నీచుడా, అంత ధీమాగా మాట్లాడకు, నాగుమల్లిని ఎక్కడ దాచావు?

దివిటీ కాంతి కిటికీ లోంచి బయటకి కనబడుతున్నది.

శివాలుడు తలుపు దగ్గరకు పోయి దాన్ని గట్టిగా తడుతూ, 'ఎవరూ లోపల? తలుపు తెరవండి!' అన్నాడు.

లోపలినుంచి జవాబు లేదు. శివాలుడు తలుపును గట్టిగా తోశాడు. అది కిర్రు మంటూ తెరుచుకున్నది. లోపల ఒక కొయ్యబల్ల మీద శిథిలాలయ పూజారి కూర్చుని ఉన్నాడు.

అతడు శివాలుణ్ణి చూస్తూనే వికృతంగా నవ్వి, 'ఓహో, కులపెద్దలంతా కలిసికట్టుగా వచ్చినట్టుందే! స్వాగతం అనక తప్పదు గదా? లోపలకి రండి' అన్నాడు.

పూజారి ధైర్యం, తెగువతనం చూసి

వెంటనే చెప్పు' అంటూ హుంకరించాడు. పూజారి మాట్లాడబోయి, మెడమీద శివా లుడి గుప్పెట బిగిసి ఉండటంతో గిలగిల్లా డుతూ కళ్లు తేలవేసే స్థితికి వచ్చాడు. వాణ్ణి చంపే ముందు, నాగుమల్లి ఎక్కడ ఉన్నదీ తెలుసుకోవడం ముఖ్యం అనుకుని శివా లుడు అతడి మెడపట్టు వదిలాడు.

పూజారి మెడను రెండు చేతులతో కాసేపు సవరించుకుని, ఒకసారి గట్టిగా కాండ్రించి పట్టరాని కోపంతో ముక్కుపుటాలు అదురు తుండగా, శివాలుడి కేసి తీవ్రంగా చూస్తూ, 'శివాలూ, చివరికి నువ్వు ఆటవికుడివన్న సత్యాన్ని బయటపెట్టుకున్నావు. నేను నీ మిత్రుడి కుమార్తెను అపహరించి కూడా, మిమ్మల్ని కావాలని ఇక్కడికి ఎందుకు పిలిచానో నీకర్థమైనట్లు లేదు. మరొకమాట: శిథిలాలయ పూజారి పాదాలను తప్ప మరే శరీరభాగాన్నీ మానవమాత్రుడెవరూ తాక రాదు. అటువంటి పవిత్రమైన శరీరంలో మెడభాగాన్ని పట్టుకుని నువ్వు నీ నాశనాన్నీ, నీ వంశ నాశనాన్నీ, కోరి తెచ్చుకున్నావు' అన్నాడు.

'ఆ వెధవ కోతలన్నీ కట్టిపెట్టి, ముందు నాగుమల్లిని ఎక్కడ దాచావో చెప్పు! అలా చెప్పకపోయావో, ఈ సారి నీ తుచ్ఛమైన దేహాన్ని నేను తాకను. దాన్ని మా పెంపుడు కుక్క ఎఱ్ఱగండు ఆకలయినప్పుడల్లా తీవ్ర స్వరంతో కొంచెం కొంచెంగా తినేస్తుంది' అన్నాడు శివాలుడు.



ఎఱ్ఱగండు అన్నమాట వింటూనే కుక్క శివాలుణ్ణి సమీపించి, అతడి పక్కగా నిలబడి చిన్నగా మొరుగుతూ, శిథిలా లయ పూజారి కేసి దూకేందుకు కాళ్లు చాచబోయింది.

శివాలుడు దాని తల నిమురుతూ, 'ఈ నీచుడి దేహం విషంతో సమానమన్న భయం నాకుంది. తొందరపడి తిని ప్రాణాపాయం తెచ్చుకోవడం ఎందుకు, కొంచెం ఆగు' అన్నాడు. 'శివాలూ, ఈ అవమానాన్ని నేను సహించను. నీ మేలు కోరి ఒక మాట చెపుదామని వచ్చాను. కాని నీ ధోరణి నాకు కోపం తెప్పిస్తున్నది. నేను వెళుతున్నాను' అంటూ శిథిలాలయ పూజారి బల్లమీద నుంచి లేచాడు.

అప్పటివరకూ తనలో పొంగే కోపాన్ని అణచుకుని, ఓ పక్కగా నిలబడి అంతా వింటున్న సవరగండుపోతు, పూజారి లేచి నిలబడగానే, ఇక కోపాన్ని పట్టలేక ఎగిరి అతడి మీద పడి, రెండు చేతుల్తో పైకెత్తి నేలకు విసిరి కొట్టబోయాడు.

శివాలుడు చప్పున, గండుపోతు ముందుకుపోయి, అతడి చేతుల్లో విలవిల తన్నుకుంటున్న పూజారిని నడుం పట్టుకుని కిందకు దింపి, 'పోతూ, కొంచెం ఆగు, ముందు నాగుమల్లి ఎక్కడ ఉన్నదో తెలుసుకోనియ్యి. తరవాత వీణ్ణి నీ ఇష్టం వచ్చినట్టు చిత్రవధ చేద్దువు గాని' అన్నాడు.

శిథిలాలయ పూజారి భయంతో వణికి పోతూ, 'మీరింత బుద్ధిహీనులని తెలిస్తే, నేనిక్కడికి వచ్చేవాణ్ణి కాదు. నా దారిన నేను హిమాలయాలకు వెళ్ళిపోయేవాణ్ణి. సరే, నాగుమల్లి ఎలాంటి ప్రమాదంలో చిక్కుకుని ఉన్నదో మీకు అంతుబట్టినట్లు లేదు. మీ ఇద్దరు మూర్ఖ ఆటవికుల్నీ చంపేందుకు నేను నా మహామంత్ర శక్తిని వృధా పరచదలచలేదు. ఇక్కడ నేను మరణించటమే జరిగితే, ఆ మరుక్షణంలో నాగుమల్లి అక్కడ చిత్రవధ చేయబడుతుంది. అందుకు అవసరం అయిన ఏర్పాట్లన్నీ చేసే నేను మీ మధ్యకు వచ్చాను. జాగ్రత్త!' అన్నాడు.

పూజారి ఇలా అనేసరికి శివాలుడికీ, గండుపోతుకూ వాడి ఎత్తుగడ అర్థమైపోయింది. ఇక్కడ పూజారికి ఎలాంటి హాని జరిగినా, అతడి భృత్యులు నాగుమల్లిని హత్య చేస్తారు...





'పూజారీ, ఇప్పటికి నీ కుతంత్రం ఏమిటో నాకు పూర్తిగా అర్థమైంది. సరే, నీకు ఎలాంటి ప్రాణాపాయం రాదు. నాగుమల్లిని ఎక్కడ మా స్వాధీనం చేస్తావు?' అని అడిగాడు శివాలుడు.

'నాగుమల్లిని వట్టినే మీకు తిరిగి ఒప్ప గించదలిస్తే, అసలు ఇక్కడికి నేను రావడం ఎందుకు? నేను పిచ్చివాణ్ణనుకున్నారా? విక్రమకేసరి నీకు తెచ్చి ఇచ్చిన, తాళ పత్రాలు నా స్వాధీనం చేస్తే, నాగుమల్లి సజీవంగా మిమ్మల్ని చేరుతుంది. లేకపోతే, రేపు సూర్యోదయం వేళ, తలలేని ఆమె మొండెం, కొండ మలుపున ఉన్న రావి చెట్టుకు వేలాడుతూ ఉంటుంది' అన్నాడు శిథిలాలయ పూజారి.

'సరే, అలాగే ఆ తాళపత్రాలు పల్లె నుంచి తెప్పించి నీకిస్తాను. కాని నాగుమల్లిని నువ్వు వదులుతావన్న నమ్మకం ఏమిటి?' అని అడిగాడు శివాలుడు.

'నేను ఆటవికుణ్ణి కాను. దేవీభక్తుణ్ణి! దేవీ భక్తుడు మాట తప్పడు. ఆ తాళ పత్రా లున్న సంచీని, తెల్లవారే లోపల ఆ రావి చెట్టుకు వేలాడ కట్టండి. వాటిని నా శిష్యుడు తీసుకోగానే, నాగుమల్లి అక్కడే మిమ్మల్ని కలుసుకుంటుంది' అన్నాడు శిథిలాలయ పూజారి.

'మాట తప్పవు గదా?' అన్నాడు శివా లుడు.

'ఆ మూర్ఖ ప్రశ్నకు ఇంతకు ముందే జవాబు చెప్పాను. మరో అరగంటలో నేను నా స్థానానికి చేరకపోతే, నాగుమల్లి మొండెం రావిచెట్టును చేరుతుంది. వెళతాను... సూర్యోదయం లోపల.. గుర్తుంది గదా?' అంటూ శిథిలాలయ పూజారి పాకలోంచి బయటకు నడిచి, చీకట్లో కలిసిపోయాడు.

పూజారి పోగానే, శివాలుడు, గండుపో తుతో, 'పోతూ! మొత్తం మీద ఈ పూజారి మన మీద విజయం సాధించాడు. నాగు మల్లి ప్రాణం కన్న ఆ తాళపత్రాలేమీ ఎక్కువ కాదు. కాని, నా పూర్వ యజమాని పుత్రుడు ప్రాణప్రదంగా నా దగ్గిరకు పంపిన వాటిని కాపాడలేకపోయానే అన్న విచారం నాకు కలుగుతున్నది' అంటూ వాకిలి పక్కగా నిలబడి ఉన్న విక్రమకేసరి కేసి తిరిగి 'కేసరీ!

నీ అభిప్రాయం ఏమిటి? ఇంతవరకూ నువ్వు ఒక్కగా నొక్క మాట కూడా మాట్లాడ లేదు' అన్నాడు.

'పెద్దలు మీరంతా సంప్రతించుకుంటు న్నప్పుడు, నేను మధ్యలో కల్పించుకోవటం బాగుండదని ఊరుకున్నాను. నాగుమల్లిని రక్షించేందుకు, ఆ తాళపత్రాలను పూజారి పరం చెయ్యటమొక్కటే మార్గంగా నాకు తోస్తున్నది. ఒకసారి నాగుమల్లి సురక్షితంగా మనను చేరింతరవాత, తాళపత్రాలను తిరిగి సంపాయించేందుకు పూజారిని వేటాడ వచ్చు' అన్నాడు విక్రమకేసరి.

'కుర్రవాడివైనా, చాలా వివేకమైన మాట చెప్పావు' అని శివాలుడు విక్రమ కేసరిని మెచ్చుకుని, తన అనుచరులైన శబరులతో, 'వెంటనే కుంభారమిట్టపల్లెలోని తన ఇంటికి వెళ్లి, తాళపత్రాలు తీసుకురమ్మ'ని చెప్పాడు.

ఈ లోపల శిథిలాలయ పూజారికి గుర్రాన్ని అమ్మమని చెప్పిన దొంగలిద్దరినీ అనుసరించిపోయిన శిఖిముఖి, అరణ్యంలో వాళ్లుండే ఇంటిని చేరుకున్నాడు.

దొంగలిద్దరూ తలుపు తట్టగానే అది తెరుచుకున్నది. శిఖిముఖి ఇంటినానుకుని ఉన్న చెట్ల చాటునుంచి కిటికీలోగుండా లోపలికి చూశాడు.

లోపల కాగడాల వెలుగులో మరిద్దరు దొంగలు అతడి కంటబడ్డారు. నాగుమల్లి గోడపక్కగా ఉన్న ఒక కొయ్య బల్లమీద




కూర్చుని ఉన్నది. ఆమె చేతులు రెండూ తాళ్లతో బంధించబడి ఉన్నవి.

ఆ దృశ్యం చూస్తూనే శిఖిముఖి కోపంతో నిలువెల్లా కంపించిపోయాడు. ఓ క్షణం అతడు తలుపు తోసుకుని లోపలికి పోయి దొంగల్ని హతమార్చాలనుకున్నాడు. కాని, మరుక్షణంలో అతడు ఆ ప్రయత్నం తనకే కాక, నాగుమల్లికి కూడా ప్రమాదకారణం అవుతుందని గ్రహించాడు.

ఇప్పుడు తను చేయవలసింది కొండ లోయలోకి సాధ్యమైనంత త్వరగా పోయి విక్రమకేసరినీ మరి కొందరినీ వెంటబెట్టు కుని వచ్చి, ఇంటిని చుట్టుముట్టి పూజారి అనుచరులను హతమార్చి, నాగుమల్లిని విడిపించుకుపోవటం..

శిఖిముఖి ఇలా ఆలోచించేంతలో అతడికి పూజారి ఎక్కడ అన్న ప్రశ్న ఎదురైంది.

వాడూ, వాడి బంటు సవరభేరుండం ఎక్కడికి పోయారు? ఒకవేళ పూజారి, నాగు మల్లిని దొంగలపరం చేసి తాను తన బంటుతో బ్రహ్మపుత్రానదీ ప్రాంతాలకు తిరిగి ప్రయాణమయ్యాడా?

ఆలోచిస్తూ కాలం వృధాపుచ్చటం మంచిది కాదనుకుంటూ శిఖిముఖి కిటికీ నుంచి ఇవతలికి వచ్చి, పొదల చాటున నక్కుతూ, అరణ్యం కేసి పోయే కాలిబాట మీదికి వచ్చాడు. హఠాత్తుగా అతడికి గుర్రపు గిట్టల సవ్వడి వినిపించింది. శిఖిముఖి చప్పున దారికి పక్కనున్న పొదల చాటుకు పోయాడు. అంతలో ఒక చెట్టు చాటు నుంచి సవరభేరుండం పరిగెత్తుకుంటూ వచ్చి, 'ఎవరక్కడ? పొదల చాటున దాగిందెవరు? బయటికి వచ్చేయండి!' అంటూ కేక పెట్టాడు.

శిఖిముఖి ప్రమాదాన్ని గుర్తించి, అక్కణ్ణించి మరి కొంచెం దూరంగా కదిలేంతలో శిథిలాలయ పూజారి గుర్రం మీద వేగంగా అక్కడికి వస్తూ, 'ఎవడూ, భేరుండమా? ఏమిటా కేకలు? శత్రువులకు మన నివాసం తెలియపరచాలనుకుంటున్నావా?' అన్నాడు కోపంగా.

'కాదు పూజారిదేవా! పొదల్లో ఏదో అలికిడయింది!' అన్నాడు భేరుండం తడబడుతూ.

'ఆ అలికిడేదో నీ బుర్రలో అయింది. వద్దంటే మళ్లీ అతిగా తాగుతున్నావు. సరే, ఆ అలికిడికి కారణం ఏమిటో చూసి త్వరగా రా,' అంటూ పూజారి గుర్రాన్ని ఇంటికేసి దౌడు తీయించాడు.

సవరభేరుండం చేతిలో ఉన్న ఈటెను ఝుళిపిస్తూ, శిఖిముఖి దాగి ఉన్న పొదల కేసి అడుగులో అడుగు వేసుకుంటూ బయలుదేరాడు. (ఇంకా ఉంది)





# జగదేకవీరుడు

పూర్వం ఆనందనగరాన్ని నిత్యానందుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతడికి భాసురాంగి అని ఒక్కగా నొక్క కుమార్తె.

భాసురాంగి నిజంగా పేరుకు తగ్గ అందగత్తె. జగదేకసుందరి. ఆనాటి రాజపుత్రులలో ప్రతి ఒక్కడూ ఆమెను వివాహం చేసుకోవాలని ఉవ్విళ్లూరుతూ ఉండేవాడు. చివరికి ఇదొక గడ్డు సమస్యగా తేలింది. రాకుమారి వివాహ విషయమై రాజూ మంత్రీ మొదలైన ప్రముఖులంతా తలలు బద్దలు గొట్టుకోసాగారు.

'నా భర్త కాబోయేవాడు తప్పక జగదేకవీరుడై ఉండాలి. మన పొరుగురాజైన వజ్రకాయుణ్ణి మించిన వీరులు లేరు కదా? అతడిని జయించిన వాడే నా భర్త ఔతాడు', అంది రాకుమార్తె. ఈ వార్త రాజుకు తెలిసింది. రాజూ, తన కుమార్తె తెలివితేటలకు అచ్చెరువొందాడు.

తనకు సమీపంలో ఉండే తిమిర ద్వీపాన్ని పాలించే వజ్రకాయుడు మహా క్రూరుడూ, బలశాలీ అన్నది లోకవిదితమే. ఈ దెబ్బతో వాడి మరణం, తన కుమార్తె వివాహం ఒక్కసారిగా జరిగిపోగలవనుకున్నాడు. వజ్రకాయుణ్ణి జయించిన వాడికి తన కుమార్తె నిచ్చి పెళ్లి చేస్తానని రాజు ప్రకటించాడు.

ఆ వెంటనే ఎక్కడెక్కడ ఉన్న రాజకుమారులూ తిమిర ద్వీపానికి బయలుదేరారు. తిమిర ద్వీపం ఒక చిన్న రాజ్యం. ఆనంద నగరానికీ, ఆ ద్వీపానికీ మధ్య

పి. నీలకంఠం




ఒక చిన్న సముద్రపాయ అడ్డు. ఆ ద్వీపపు రాజైన వజ్రకాయుడు మహా బలశాలి. అతడు మరొక దేశం మీదికి దండెత్తేవాడు కాదు. తన ద్వీపంలోకి ఎవడు వచ్చినా శాస్తి చేయకుండా వదిలేవాడు కాదు.

రాజకుమారులు ఒక్కరొక్కరే తిమిర ద్వీపానికి బయలు దేరారు కదా! వజ్ర కాయుడు మహా బలశాలి అనీ, అజేయు డనీ తెలిసినా, భాసురాంగిని వివాహం ఆడవచ్చుననే ఆశతో చాలామంది తెగించి ముందుకు వచ్చారు.

తిమిరద్వీపానికి ఎదురుగా ఇవతలి సముద్రపు ఒడ్డున చిన్న పడవల రేవు ఒకటి ఉన్నది. పడవ ఎక్కి, ఆ చిన్న సముద్రపు పాయ దాటి తిమిరద్వీపంలో దిగడం ప్రారంభించారు వారంతా. మొట్ట మొదట వజ్రకాయుడితో యుద్ధానికి తలపడే అవకాశం కాంచనదేశ రాజ కుమారుడికి కలిగింది. సముద్రపు అవ తలి ఒడ్డున వేలాది ప్రజలతో నిత్యానం దుడూ, రాజకుమార్తె వేచి ఉన్నారు. తిమిరద్వీపంలో దిగిన తర్వాత కనీసం ఒక గంట కాలమన్నా గడవక ముందే కాంచన దేశపు రాకుమారుడు సముద్రం వైపు పరుగెత్తుకు రావడం అందరి కళ్లా పడింది.

మరొక గంటకల్లా రాజకుమారుడు ఈ రేవులో పడవమీదనించి దిగాడు. ప్రజలూ, రాజు ఏం జరిగిందని ప్రశ్నిం చకముందే 'అయ్యా, నా కుడిచేతి చిటి కెన వేలు నరికి వేశాడు. బాధ, బాధ! వైద్యులెవరూ లేరా?' అంటూ కేకలు పెట్టసాగాడు.

కాసేపటికల్లా వజ్రకాయుడు ఏం చేసిందీ అందరికీ తెలిసిపోయింది. తిమి రద్వీపంలో కాంచనదేశపు రాజకుమా రుడు దిగీ దిగటంతోనే వజ్రకాయుడే స్వయంగా వచ్చి కత్తి యుద్ధంలో అతన్ని ఓడించాడు.

తక్కిన రాజకుమారులకు హెచ్చరి కగా ఉండేటట్టు వజ్రకాయుడు అతడి కుడి చేతి చిటికెన వేలు మాత్రం నరికి ప్రాణాలతో పోనిచ్చాడు.

‘వేలు నరికి వదిలాడు. మెడ నరి కాడు కాదు!’ అంటూ అక్కడ చేరిన ప్రజలంతా వారిలో వారు నవ్వుకున్నారు.

తరవాత ఇంకొక దేశపు రాజకుమారుడు తిమిరద్వీపానికి బయలుదేరాడు. అతడికీ ఓటమి కలిగింది. కుడిచేతి చిటికెనవేలును మాత్రం కోసి, వజ్రకాయుడు అతణ్ణీ ప్రాణాలతో వదిలేశాడు.

ఈ విధంగా పది పదిహేను రోజులయ్యేసరికి దేశదేశాలనుంచి వచ్చిన రాజకుమారులందరికీ వజ్రకాయుడు చిటికెన వేలు నరికి పంపటం మామూలైంది. ఏ రాజకుమారుడి హస్తాన్ని చూసినా ఐదువేళ్లకు బదులు నాలుగు వేళ్ళే కనిపించసాగినై! వాళ్ల బతుకు తలవంపులయిపోయింది.

పరిస్థితులు ఇలా తయారయ్యేసరికి నిత్యానందుడు దిగులుపడిపోయాడు. రాజకుమార్తె భాసురాంగి కూడా కలతపడింది. అప్పటికి వందలకొద్దీ రాజకుమారుల చిటికెనవేళ్లు, వజ్రకాయుడికి కత్తికి బలైపోయాయి. తరవాత ఏం చేయటమా అని అందరూ ఆలోచిస్తుండగా, ఎక్కడినుంచో ఒక యువకుడు రాజదర్శనం కోసం వచ్చాడు.

‘ప్రభూ! నేను రాజకుమారుణ్ణి కాను: ఒక కాపు బిడ్డని, నేను వజ్రకాయుణ్ణి జయిస్తే, నాకు తమ పుత్రికను ఇచ్చి




వివాహం జరిపిస్తారా?’ అని అడిగాడు. రాజు మంత్రి కేసీ, కుమార్తె కేసీ ఓమారు చూశాడు. అంగీకార సూచకంగా వాళ్లు తలలూపగానే ‘వజ్రకాయుణ్ణి జయించినవాడు ఎవడైనా తప్పక జగదేకవీరుడే అవుతాడు. అలాంటివాడికి తప్పక నా కుమార్తెనిచ్చి వివాహం చేస్తాను,’ అని ప్రకటించాడు రాజు.

ఆ వచ్చిన కాపు యువకుడు సెలవు తీసుకుని వెళ్లిపోయాడు. వజ్రకాయుని చేత ఓడింపబడిన ప్రతి ఒక్కడికీ కుడి చేతికి నాలుగు వేళ్లు మాత్రమే ఉంటవనేది ఇదివరకే మనకు తెలుసు. ఒకసారి సముద్రం దాటి ఆ ద్వీపాన్నుంచి కుడి చేతికి ఉన్న ఐదు వేళ్లతోనూ బయటపడ

గలిగితే వాడు వజ్రకాయుణ్ణి జయించినట్లే అనుకున్నారు రాజూ ప్రజలున్నూ.

ఈ సంగతి అంతా ఎరిగి ఉన్న ఆ కాపు యువకుడు గడ్డికోసే కొడవలి తప్ప, మరే కత్తీ పట్టుకోవడం చేతకాకపోయినా, ధైర్యంగా వజ్రకాయుడిమీదకు యుద్ధానికి బయలుదేరాడు.

కాపు యువకుడు తిమిరద్వీపంలో దిగి కాలు పెట్టగానే వజ్రకాయుడు తళతళ మెరిసే కత్తితో తారసపడ్డాడు.

'ఎంతమందికి వేళ్లు నరికి పంపినా ఇంకా ఈ ద్వీపానికి వస్తూనే ఉన్నారు. ఇక సొంతం మనిషినే నరికేస్తా. పీడ వదులుతుంది,' అంటూ హుంకరించాడు.

దానికి కాపు యువకుడు-- వినయంగా, 'మహాప్రభూ! నేను మీమీద యుద్ధం చేయకుండానే ఓటమి అంగీకరిస్తున్నాను. ఆ చిటికెన వేలు కాస్తా నరికి పుచ్చుకున్నారంటే నాదారిన నేను పోతాను' అన్నాడు. వజ్రకాయుడికి ఈ మాటలు ఎంత గానో ఆశ్చర్యాన్ని కలిగించినై. అయినా శ్రమ లేకుండానే పని ముగించుకోవచ్చు కనుక సరేనని కాపు యువకుడి కుడిచేతిని పట్టుకుని చివరి వేలు నరికివేసి, పొమ్మన్నాడు.

కాపు యువకుడు విచారించడానికి బదులు సంతోషిస్తూ, పడవ ఎక్కి తీరానికి చేరాడు. పడవ ఒడ్డుకు రాకముందే కుడిచేతితో ఒక పెద్ద కత్తిని ఝళిపిస్తూ 'వజ్రకాయుడు ఓడిపోయాడు! చూడండి నా చేతివేళ్లను!' అంటూ కుడిచేతిని ఎత్తి తన ఐదువేళ్లనూ చూపించాడు.

అక్కడ చేరిన ప్రజలందరూ 'జగదేక వీరుడికీ జై!' అని కేకలు వేయసాగారు. వెంటనే రాజకుమార్తె భాసురాంగి అతని మెడలో పూలమాల వేసింది. ఐతే, అతని చేతికి మొదట్లో ఆరువేళ్లున్నాయని ఒక్కళ్లూ కనిపెట్టలేకపోయారు.





# తప్పుడుపత్రం

యశస్కరుడు కాశ్మీరదేశాన్ని పరిపాలించే కాలంలో, మాటల మాయవల్ల, కష్టపడి సంపాదించుకున్న ధనాన్ని కాజేసిన వాని కథను చదివి ఉన్నాం కదా!

మరొకప్పుడు ఒక రోజున న్యాయ శాఖకు సంబంధించిన ఉద్యోగులు వచ్చి 'ప్రభూ! ఒక బ్రాహ్మణుడు మన దివాణంలో ప్రాయోపవేశం చేస్తున్నాడు' అని చెప్పారు.

తక్షణమే రాజు ఆ బ్రాహ్మణ్ణి పిలిపించి, 'మీ ఫిర్యాదు ఏమిటీ?' అని అడిగాడు. ఇందుకు ఆ బ్రాహ్మడు ఇలా సంజాయిషీ చెప్పుకున్నాడు.

''కాశ్మీరదేశ ముఖ్యపట్టణమైన శ్రీనగరపు శ్రీమంతులలో నేనొకడను. ఐతే, కాలం మారింది. స్థితిగతులు మారినై. ఆస్తులు తరిగిపోయినై. అప్పులు చుట్టుకొన్నాయి. ఇల్లూ వాకిలీ, తోటా, దొడ్డీ అన్నీ అమ్మేసి, బ్రతుకుతెరువు కోసం ఎక్కడికన్నా పోదామని నిశ్చయించుకొన్నాను.

''ఆ ఊరిలోనే ఒక వర్తకుడు నా ఆస్తి నంతటినీ కొనుక్కున్నాడు. ఐతే తోటలో ఉండే ఒక దిగుడు బావి మాత్రం అమ్మి వేయకుండా నా భార్యకోసమని అట్టే పెట్టాను.

''ఎండాకాలంలో తోటమాలీలు ఈ బావిలో నీళ్లే తోడిపోసుకొని-- పూల మొక్కలు తడుపుకుంటారు. ఇలా వాళ్లు బావినీళ్లు వాడుకున్నందుకు, ఏటా శిస్తు రూపకంగా కొంత ప్రతిఫలం చెల్లిస్తూ ఉంటారు. ఇలా వచ్చే ఆదాయంతో నా భార్యకు సుఖంగా భుక్తి గడిచిపోతుందనే

ఇ. భాస్కరమ్మ

ఉద్దేశంతోనే బావిని కేటాయించి అట్టె పెట్టింది. నా భార్య భుక్తి విషయంలో ఇటువంటి ఏర్పాటు చేశాను అనే తృప్తితో, వెనక దిగులు ఏమీ పెట్టుకోకుండా దేశాంతరం వెళ్ళి పోయాను.

''ఇరవయ్యేళ్ళ తరవాత, కొంత సంపాదనతో, మళ్ళీ దేశానికి తిరిగి వచ్చాను. తిరిగి వచ్చి చూసేసరికి నా భార్య ఎవరింటిలోనో చాకిరీ చేసుకుని పొట్ట పోసుకొంటున్నట్టు తెలియవచ్చింది. ఈ మాట తెలియగానే నాకు కోపమూ వచ్చింది. దుఃఖమూ పొరలి వచ్చింది. వెంటనే నా భార్యను పిలిపించి, 'నీ భుక్తికి తగిన ఏర్పాటు నేను చేసే వెళ్ళాను కదా! ఇప్పుడీ గతి పట్టటం ఎందుచేత?' అని అడిగాను.

''అందుకామె మీరు దేశాంతరం వెళ్ళాక నేను ఆ దిగుడు బావి దగ్గరకు వెళ్ళాను. వెళ్ళేసరికి, మన ఇల్లు కొన్న వర్తకుడు నన్ను నానా మాటలూ అని, చావగొట్టి, బయటకు సాగనంపాడు. ఆడదాన్ని, ఏం చెయ్యగలను...? అంటూ తన గోడు వెలపోసుకొన్నది.

''వెంటనే న్యాయాధిపతుల వద్దకు వెళ్ళి, ప్రాయోపవేశం చేసి, దుష్టుడైన ఆ వర్తకుడు నా నూతిని అన్యాయంగా వశపరుచుకున్నాడు, అని ఫిర్యాదు చేశాను. అంతా విని, ఉద్యోగులు వర్తకునిదే న్యాయమని తీర్పు చెప్పారు. అందుచేత, నా నూతిమీద నాకున్న అధికారం నేను వదులుకోవలసి వచ్చింది.

''ఇలా ఎంతమంది పెద్దమనుష్యుల వద్దకు వెళ్ళి చెప్పుకున్నా, అందరూ కూడా వర్తకుడి పక్షాన్నే తీర్పు చెబుతూ వచ్చారు'' అంటూ జరిగిన సంగతి అంతా చెప్పాడు. చెప్పి, 'మహారాజా! నేను కేవలమూ అమాయకుణ్ణి. ఈ దావాలూ, పిర్యాదులూ ఏమీ తెలియనివాణ్ణి. అప్పుడూ ఇప్పుడూ నాది ఒక్కటే మాట. ఇల్లూ దొడ్డీ మాత్రమే ఆ వర్తకునికి అమ్మాను కాని, పెరట్లో ఉండే బావి మట్టుకు అమ్మనే లేదని ప్రమాణం చేసి చెబుతున్నాను.

కనుక, ఈ విషయంలో ఏలిక న్యాయం అనుగ్రహించక పోయినట్టయితే, ఈ

రాజద్వారం వద్ద ప్రాణాలు విడవడం తప్ప గత్యంతరం లేదు', అన్నాడు.

మరునాడు యశస్కరుడు విచారణకు కూర్చున్నాడు. వాది, ప్రతివాది, సాక్షులు, ఇదివరలో ఈ ఫిర్యాదు విచారణ చేసి తీర్పులిచ్చిన అధికారులు అందరూ రాజాజ్ఞ ప్రకారం హాజరయ్యారు.

'విచారణ ఎలా జరిగిందీ? అని రాజు వేసిన ప్రశ్నకు, న్యాయాధిపతులు ఇలా చెప్పారు: 'ప్రభూ! మేము ప్రతిసారీ న్యాయంగానే విచారణ చేసి తీర్పు చెప్పాము. దుష్టబుద్ధి గల ఈ బ్రాహ్మడు మా తీర్పులను పాటించడం లేదు. అసలు క్రయపత్రమే కల్పితమని చెప్ప టానికి కూడా సాహసిస్తున్నాడతను'.

అప్పుడు రాజు పత్రం తీసుకుని పరి శీలనగా చూశాడు. 'కూపసహితముగా ఇల్లూ, తోటా విక్రయించడమైనది...' అని అందులో స్పష్టంగా వ్రాసి ఉన్నది.

ఆలోచించాడు రాజు. తరవాత సభలో ఉన్నవారితో అదీ ఇదీ మాటాడుతూ కూర్చున్నాడు. మాటల సందర్భంలో రత్నాల ప్రసక్తి వచ్చింది.

రాజు, అక్కడ ఉన్నవారి ఉంగరాలు తీసుకుని, వాటిలోని ఆభరణాలను కుతూహలంతో పరిశీలించసాగాడు.

ఆ తరువాత, సరదాగా మాటాడు తూనే నవ్వుతూ నవ్వుతూ, ఇతరుల




వద్దనుంచి తీసుకున్నట్టే, ప్రతివాది ఐన వర్తకుని దగ్గిర కూడా ఉంగరం ఇవ్వమని అడిగి తీసుకున్నాడు.

అలా, ఇవతలకి వచ్చేసిన యశస్క రుడు, ఆ ఉంగరాన్ని భటుని చేతికిచ్చి, 'ఈ ఉంగరం తీసుకుని నువు వర్తకుని ఇంటికి వెళ్లు. వర్తకుని గుమాస్తాను కలు సుకో. ఈ ఉంగరం ఆనవాలు చూపించి, ఇదుగో ఫలానా సంవత్సరపు జమా కర్చుల చిట్టా కావాలని అడిగి పట్టు కురా', అని చెప్పి పంపాడు.

ఆ కాలంలో వ్యవహారాలు నడిపేట ప్పుడు వ్యక్తిపై నమ్మకం కలగటానికని ఇలా ఆనవాలుగా ఇచ్చే వస్తువును అభి జ్ఞానము అనేవాళ్లు.

రాజుగారి భటుడు వర్తకుని ఇంటికి వెళ్ళి, 'అభిజ్ఞానం' గుమస్తాకు ఇచ్చి చిట్టా పుస్తకం ఇమ్మని అడిగాడు.

దాన్ని చూసిన తర్వాత గుమాస్తా ఏ విధంగానూ సందేహపడటానికి అవకాశం లేకపోయింది. అతడా ఉంగరాన్ని దగ్గర ఉంచుకొని, భటుడికి కావలసిన చిట్టా ఇచ్చిపంపాడు.

చిట్టా రాగానే, యశస్కరుడు జాగర్తగా చూచాడు. పద్దుల మధ్యని ఒకచోట ఆ క్రయ దస్తావేజు వ్రాసిన లేఖరికి వేయి రూపాయలిచ్చినట్టు ఖర్చు కనబడింది.

పత్రం వ్రాసిన లేఖరికి ఇంత సొమ్ము ఇవ్వటమనేది రాజుకు విడ్డూరంగా తోచింది. వర్తకుడు ఇలా చేయడానికి కారణం ఏమై ఉంటుంది? అని కొంచెం నిదానంతో యోచించాడు.

ఈ క్రయవిక్రయం వ్యవహారంలో దాగివున్న కిటుకు రాజుకు బోధపడింది. తక్షణమే రాజు దర్బారులోని అందరికీ చిట్టా చూపించాడు. పత్రం వ్రాసిన లేఖరిని పిలిపించి ప్రశ్నించాడు.

'మహాప్రభూ! అపరాధం మన్నించాలి. నేను వర్తకుని వద్దనుంచి వేయి రూపాయిలు తీసుకున్న మాట వాస్తవం. తీసుకుని 'కూపరహితముగా' అన్న మాటను,' కూపసహితముగా' అని దిద్ది, మార్చి వ్రాసిన మాటా నిజమే. ప్రభువులు దయామయులు. క్షమించాలి...' అంటూ పాదాలమీద పడ్డాడు.

వర్తకుని మోసం రుజువయింది. లోగడ తీర్పులిచ్చిన న్యాయాధిపతులందరూ తెల్లబోయారు. పట్టుబడిన లేఖరిని రాజు క్షమించి వదిలాడు.

వర్తకుడు కొన్న ఇల్లూ పెరడూ అంతా వాది ఐన బ్రాహ్మడికి ఇప్పించి వేసి, అపరాధి ఐన వర్తకుణ్ణి రాజ్యంలోనుంచి వెళ్లగొట్టించాడు.



# కెరీర్ అంటే?

మిత్రులారా!

ఆదివారం అమ్మానాన్నలతో కలిసి నేను మహాబలిపురం వెళ్లాను. రోజు మొత్తం అక్కడే హాయిగా గడిపాము. అక్కడ నేను ఫ్యాషన్ ఫోటోగ్రాఫర్ అజిత్‌ని కలిశాను. తన వృత్తి గురించి తెలుసుకోవడానికి నేను అతడితో కలిసి వెళ్లాను. అక్కడి విశేషాలను మీతో పంచుకుంటాను.

ఫ్యాషన్ ఫోటోగ్రాఫర్లు పేరు పొందిన మోడల్స్, నటులు, ట్రెండీ డిజైనర్లతో కలిసి పనిచేస్తారు. పత్రికలకు, వార్తాపత్రికలకు గాను మోడల్స్, సెలెబ్రిటీల ఫోటోలు తీస్తారు.

వృత్తినైపుణ్యం కలిగిన ఆహార్యంతో దుస్తులు, అనుబంధ దుస్తులు, శిరోజాలంకరణను ఈ షూటింగులో ఉపయోగిస్తారు.

ఫ్యాషన్ ఫోటోగ్రాఫర్లు అన్ని సందర్భాలలోనూ అనుకూల పరిస్థితుల్లోనే పనిచేయలేరు. వీరు ఇండోర్‌లో అవుట్‌డోర్‌లో కూడా షూటింగ్ తీస్తారు. వీళ్లు బహిరంగ ప్రదేశాలలో అత్యంత ఉష్ణ, శీతల వాతావరణాల్లో ఫోటోలు తీస్తారు. ఇక్కడ ఫోటోగ్రాఫ్ నాణ్యతతో రాజీ పడకుండానే అనేక అంశాలను వీరు మెరుగుపర్చుకోవలసి ఉంటుంది. ఫ్యాషన్ ఫోటోగ్రాఫర్‌కి ఉండవలసిన కీలకమైన నైపుణ్యాలు ఇక్కడ పొందుపరుస్తున్నాను.



సౌందర్యాత్మక వివరాలపై నిశిత దృష్టి ఉండాలి.

బొమ్మలు తీయడానికి సంబంధించిన సాంకేతికాంశాలు, కెమెరాలు, కాంతి దూరం, దృక్పథం వంటి వాటిపై సమగ్ర జ్ఞానాన్ని సంతరించుకుని ఉండాలి.

కళాత్మక స్పందన, కొన్ని రకాల మానసిక స్థితులను చిత్రించడంపై గట్టి సామర్థ్యం ఉండాలి.

మంచి కమ్యూనికేషన్ నైపుణ్యాలు:

మోడల్స్, డిజైనర్లు, అలంకరణ నిపుణులు, కళా దర్శకులు, ఏజెంట్లు, ఫ్యాషన్ ఎడిటర్లు/విలేకరులతో మంచి సంబంధాలు ఏర్పర్చుకుని, కొనసాగించడానికి బలమైన సామాజిక నైపుణ్యాలు కలిగి ఉండాలి.

ఫ్యాషన్ ఫోటోగ్రాఫర్లు రిటైలర్ ఫ్యాషన్ పబ్లికేషన్లు, ఫ్యాషన్ హౌస్‌లు, ప్రకటన సంస్థలు, ఏజెన్సీలు, ఫ్యాషన్ తయారీదారులు, నిపుణులతో కలిసి పనిచేస్తారు లేదా తమ స్వంత స్టూడియోలను నెలకొల్పుకుంటారు.

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 31

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -31 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. సెప్టెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. నవంబర్ 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భారత స్వాతంత్ర్యం



1. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం ఎప్పుడు జరిగింది?
2. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న వానర్ సేనకు నేతృత్వం వహించింది ఎవరు?
3. పార్లమెంటులో 1947 ఆగస్ట్ 14న వందే మాతరం గీతాన్ని పాడింది ఎవరు?
4. బ్రిటిష్ పార్లమెంటులో భారత స్వాతంత్ర్య చట్టం ఆమోదించబడిన సంవత్సరం
5. 1947లో బ్రిటన్ ప్రధానమంత్రిగా ఉన్న దెవరు?
6. మన జాతీయ పతాకంలోని కాషాయ వర్ణం దేనికి సంకేతం?
7. మన స్వాంతంత్ర్య దినాన్ని 3 దేశాలతో పంచుకుంటాము. అవి ఏవి?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-28 మే 2011 సమాధానాలు

1. స్విస్ ఫ్రాంక్, 2. యూరోపియన్ యూరో, 3. యుఎస్ డాలర్లు, 4. చైనా - రజిత పాండా నాణేలు, 5. కెనడా గోల్డ్ మాపిల్ లీఫ్, 6. ఆస్ట్రేలియా/యుఎస్/కెనడా హోలోగ్రామ్ నాణేలను ప్రతిపాదిస్తున్నాయి, 7. నాణేల అధ్యయన శాస్త్రం - న్యుమిస్మేటిక్స్.

*May'11 Winners: 1. S. AadhiKesavan, Tamil Nadu-628502, 2. Anmol Jain, Himachal Pradesh-176325, 3. Madhabi De, West Bengal-711101.*



# నవ్వుల పువ్వులు



*ఇంటి యజమానితో కిరాయిదారు:* క్షమించాలి, ఈ నెల నేను కిరాయి ఇవ్వలేను.
*ఇంటి యజమాని:* కిందటి నెల కూడా ఇలాగే చెప్పావు.
*కిరాయిదారు:* నా మాటల్ని నేను ఎన్నటికీ నిలబెట్టుకుంటాను.



*కొడుకు:* నాన్నా, వారసులంటే ఎవరు?
*నాన్న:* మంచి ప్రశ్న బాబూ, నేను నీ వారసులలో ఒకడిని. మీ తాత మరొక వారసుడు.
*కొడుకు:* మరి జనం వారసుల గురించి గప్పాలు కొట్టుకుంటూ ఉంటారెందుని?



*జడ్జి:* నేను ఇంతకుముందు నిన్ను చూసినట్లుందే?
*జేబు దొంగ:* కావచ్చు. చాలామంది నాకు డబ్బు బాకీపడి ఉంటారు. వారందరి ముఖాలూ నేనూ గుర్తుపెట్టుకోలేను మరి.



*రంజిత్:* ఈరోజు నా ప్రియురాలు ముఖాన్ని చాలాసార్లు కడుగుకుంటావెందుకు? అని నన్ను అడిగింది. దుమ్ముకొట్టుకుపోయి ఉంటుందని ఆమెకు చెప్పాను.
*మిత్రుడు:* అందుకామె ఏమన్నది?
*రంజిత్:* అమ్మ లాగ దుమ్ముపై పౌడర్‌ని ఎందుకు చల్లుకోలేవు అని ప్రశ్నించింది.



*మహిళ:* మేము సుత్తితో కొడుతున్నందుకు మీకు ఇబ్బంది కలిగితే క్షమించండి. మేము ఒక బొమ్మను వేలాడదీస్తున్నాము.
*ఎదురింటామె:* ఓహో. అయితే సరే. మేకు ఆవలి చివర బొమ్మ వేలాడదీసుకో వచ్చా అని అడగడానికి వచ్చాను.

రాజ ఫలహారం

# తరతరాలుగా చాకొలెట్





తీపి పదార్థాలపై మక్కువ గురించి మాట్లాడుకోవలసి వస్తే, ఒల్మెక్ తెగ ప్రజల కన్నా చాకొలెట్‌ని ఆస్వాదించే వారు మరొకరు ఉండరు! వారికి ఇదొక ప్రధానమైన ఆహారం. వాళ్లు దీనిని ఉదయం తింటారు, మధ్యాహ్నం తింటారు. రాత్రి కూడా తింటారు.



అజ్‌టెక్, మాయన్ తెగ ప్రజల జీవితంలో చాకొలేట్ ప్రత్యేక స్థానం పొందింది. అజ్‌టెక్ తెగకు చెందిన నవదంపతులు కోక్ గింజలతో చేసిన చూర్ణంని కప్పు పరిమాణంలో తీసుకుంటారు. మాయన్, అజ్‌టెక్ తెగలు కోకోవాను పండించి జొకోటల్ అని పిలిచే శీతల పానీయాన్ని తయారుచేస్తారు. నురగలు గక్కే కొకోవా పానీయంలో చీలీ మిరియాలు, జమైకా మిరియాలు, మూలికలు కలగలిసిపోయి ఘాటుగా, అసాధారణ రుచితో ఉంటుంది!



మోంటెజుమా చక్రవర్తి చాకొలేట్ అంటే పడిచస్తాడని మీకు తెలుసా? ఎరుపురంగులోని చిక్కటి చాకొలెట్ పానీయాన్ని ఇతడు మక్కువగా స్వీకరించేవాడు. ఈ పానీయాన్ని అతడికి బంగారు గ్లాసుల్లో నింపి అందించేవారు. ఒకసారి తాగిన గ్లాసును తిరిగి వాడకుండా అతడు వాటిని విసిరివేసేవాడు. రోజుకు అతడు ఎన్ని సార్లు చాకొలెట్ పానీయాలను తాగేవాడో ఊహించగలరా? 50!!!!



కొకోవా కాడలను ఆజ్‌టెక్స్ తెగల వాళ్లు చాలావిలువైనవిగా భావించే వారు. 15వ శతాబ్దంలో వారు వీటిని కరెన్సీగా వాడేవారు. ఒక కోకో కాడతో మీరు ఒక టమోటోని కొనవచ్చు. మూడు కోకా కాడలకు ఒక బేరిపండును, పది కోకో కాడలతో ఒక టర్కీ కోడిని కొనవచ్చు మరి. కోకోవా నగదు రూపంలో ప్రజలు రాజుకు పన్నులను, నజరానాలను చెల్లించేవారు.



కార్ల్ లిన్నేయస్ కొకోవాకు 'థియోబ్రోమా కకావో' అనే శాస్త్రీయ నామాన్ని చేర్చాడు. థియోబ్రోమా అంటే దేవతల ఆహారం అని అర్థం. ఈ దివ్య ఆహారానికి సరైన పేరే కదూ?

చాకొలెట్ మన శరీరంలో ఎండోర్ఫిన్స్ మరియు సెరోటోనిన్ రసాయనాలను విడుదల చేసి మీకు సంతోషం కలిగిస్తుంది!



‘గిరి చోకో’ అనేది జపాన్‌కి సంబంధించిన ఆసక్తికరమైన ఆచారం. దీనిప్రకారం ఉద్యోగులు తమ మేనేజర్లకు చాకొలెట్‌లను బహూకరిస్తారు. ఇది విశ్వాసానికి సంకేతం!

పాలైన్ చాకొలెట్ భర్తీ గురించి సుప్రసిద్ధమైన కథ ఉంది. తప్పులు చరిత్రను ఎలా సృష్టిస్తాయో ఇది తెలుపుతుంది! ఒక వంటబ్బాయి వంటగదిలో బాదం గింజలను పొరపాటున కింద పడేశాడు. కోపోద్రిక్తుడైన ప్రధాన వంటగాడు వాటిని వేడిపాత్రలో వేసి చక్కెర కలిపి వేడి చేశాడు. చక్కెరపూత కలిపిన బాదం గింజలు వెనువెంటనే అద్భుత విజయం సాధించాయి. పలు చాకొలెట్లో వీటిని కలుపుతూ వచ్చారు!





ఒకసారి, కొకోవా కాడల విలువ తెలియని ఇంగ్లీష్ దారిదోపిడీ దొంగల ముఠా ఒకటి ఓడ నిండుగా ఉన్న కొకోవా కాడలను ఊరకే తగులబెట్టేశారు. కొకోవా కాడలను వారు గొర్రె పెంటిక అని భావించారట.

సైనిక దండయాత్రలకు వెళ్లడానికి ముందుగా నెపోలియన్ చాకొలెట్లను దండిగా నిల్వ చేయించేవాడు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో చాకొలెట్, యునైటెడ్ స్టేట్స్ ప్రామాణిక మిలటరీ రేషన్‌లో భాగంగా ఉండేది. ఉడకబెట్టిన బంగాళాదుంప పరిమాణంలో చాకొలెట్‌ను సైనికులు ఆహారంగా స్వీకరించేవారు. కొన్నిసార్లు సైనికులు వాటిని తినకుండా పారవేసేవారు. ఎందుకంటే అది చేదుగాను, గట్టిగాను ఉండేది!





‘చార్లీ అండ్ చాకొలెట్’ ఫ్యాక్టరీ అనే నవలను రోల్డ్ డాల్ అనే రచయిత రాశాడు. ఇది ఒక చాకొలెట్ ఫ్యాక్టరీలో ఒక చిన్నారి బాలుడి సాహసాల గురించిన అద్భుత గాథ.

ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్ సైకో చిత్రంలో రక్తంతో కూడిన అసహ్యకరమైన దృశ్యాలను చూపేందుకు చాకొలెట్ సిరప్ ఉపయోగించేవారు (స్వీట్ షాక్ అన్నమాట!).





# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి.
ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల
ఉచ్ఛారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | We had gone to my uncle's home. | How did you come today? |
|---|---|---|
| Telugu | మేము మా మామయ్య ఇంటికి వెళ్లాము. | మీరు ఈ రోజు ఎలా వచ్చారు? |
| Hindi | हम मेरे चाचा के घर गए थे।<br>హమ్ మేరే చాచా కె ఘర్ గయే థే. | आज तुम कैसे आ गए/गईं?<br>ఆజ్ తుమ్ కైసె ఆ గయే/గయేన్? |
| Tamil | நாங்கள் மாமா வீட்டுக்குப் போயிருந்தோம்.<br>నాంగల్ మామా వీట్టుక్కు పోయిరుండోమ్. | நீ இன்று எப்படி வந்தாய்?<br>నీ ఇంద్రు ఎప్పడి వంధాయ్? |
| Bengali | আমরা আমার মামার বাড়ি গিয়েছিলাম।<br>ఆమ్రా ఆమార్ మామార్ బారి గియెచ్చిల్లామ్. | আপনি আজ কীভাবে এলেন?<br>అప్ని ఆజ్ కిబ్బాబె ఎలెన్? |
| Marathi | आम्ही माझ्या मामाच्या घरी गेलो होतो.<br>ఆమి మజ్యా మామచ్య ఘరి గెలో హోటో. | आज तू कसा/कशी येणार?<br>ఆజ్ తు ఎథ కసా/కషి ఎనార్? |
| Kannada | ನಾವು ನನ್ನ ಮಾವನ ಮನೆಗೆ ಹೋಗಿದ್ದೆವು.<br>నావు నన్న మావన మనెగె హోగిద్దేవు. | ಇವತ್ತು ನೀವು ಹೇಗೆ ಬಂದಿರಿ?<br>ఇవత్తు నీవు హేగె బందిరి? |
| Oriya | ଆମେ ମୋ ମାମୁ ଘରକୁ ଯାଇଥିଲୁ।<br>అమె మో మామూ ఘరకు జాయిథిలు. | ତୁମେ ଆଜି କେମିତି ଆସିଲ?<br>తుమె ఆజి కెమిటి అసిల్? |
| Gujarati | અમે મારા કાકાના ઘરે ગયા હતા.<br>అమె మారా కాకన్న ఘరే గయా హాటా. | તમે આજે કેવી રીતે આવી ગયા?<br>తమె ఆజె కేవీ రీతె ఆవే గయా? |
| Assamese | আমি মোৰ মামাৰ ঘৰলৈ গৈছিলো।<br>అమి ముర్ మామార్ ఘురోలోయ్ గొయిసిలు. | আজি তুমি কেনেকৈ আহিলা?<br>ఆజి తుమి కెనెకోయ్ ఆహిలా? |
| Malayalam | ഞങ്ങൾ അമ്മാവന്റെ വീട്ടിൽ പോയിരുന്നു.<br>నాంగల్ అమ్మావంతె వీట్టిల్ పోయిరున్ను. | എന്തിനാണ് ഇന്ന് വന്നത്?<br>ఎంథినాను ఇన్ను వన్నుథు? |
| Santali | ᱟᱞᱮ ᱤᱧ ᱢᱟᱢᱚ ᱚᱲᱟᱜᱮ ᱥᱮᱱ ᱱᱮᱣᱟ।<br>అలె ఇఞ్ మామో ఒదాగ్ సెన్ నెనా. | ᱪᱮᱫ ᱞᱮᱠᱟᱛᱮ ᱛᱮᱦᱮᱧ ᱵᱤᱱ ᱦᱮᱡ ᱮᱱᱟ?<br>ఛెద్ లెకారె తెహెంజ్ బిన్ హెజ్ ఎనా? |
| Sanskrit | वयं सर्वेऽपि मम मातुलगृहं गतवन्तः।<br>వయమ్ సర్వేపి మామా మాతుల్ గృహమ్ గతవంతాః. | त्वं कथमत्र आगच्छः?<br>త్వమ్ కథామాత్ర ఆగచుః? |

**మీకు తెలుసా?**

భారతీయ భాషలు పలు భాషా కుటుంబాలకు చెంది ఉన్నాయి. ఇండో–యూరోపియన్, ఇండో–ఆర్యన్, ద్రవిడియన్, ఆస్ట్రో–అసియాటిక్, టిబెటో–బర్మన్. భారత దేశానికి ప్రకటిత జాతీయ భాష లేదు. అయితే, ప్రధాన అధికారిక భాషగా హిందీ అమలులో ఉంది, ఇంగ్లీష్ ద్వితీయ అధికారికభాషగా ఉంది.






| English | I had some work in the bank. | Because I had some urgent work. |
|---|---|---|
| Telugu | నాకు బ్యాంకులో పని ఉంది. | ఎందుకంటే నాకు కొంత జరూరు పని ఉంది. |
| Hindi | मुझे बैंक में कुछ काम था।<br>ముజె బ్యాంక్ మె కుచ్ఛ్ కామ్ థా. | क्योंकि मुझे कुछ अत्यावश्यक काम था।<br>క్యోంకి ముజె కుచ్ అత్యావశ్యక్ కామ్ థా. |
| Tamil | எனக்கு வங்கியில் வேலை இருந்தது.<br>ఎనక్కు వాంగియిల్ వేలై ఇరుందదు. | எனக்கும் கொஞ்சம் அவசர வேலை இருந்தது.<br>ఎనక్కు కొంజం అవసర వేలై ఇరుదదు. |
| Bengali | ব্যাংকে আমার কিছু কাজ ছিল।<br>బ్యాంక్ ఎ అమార్ కిచ్చు కాజ్ ఛిలో. | কারন আমার কিছু জরুরী কাজ ছিল।<br>కారూన్ అమార్ కిచ్చు జొరూరి కాజ్ ఛిలో. |
| Marathi | मला बँकेत थोडं काम होतं.<br>మాజ్ బాంకెట్ తోడా కామ్ హోతా. | कारण मला थोडं तातडीचं काम होतं.<br>కారణ్ మాలా తోడా తాతాడిచా కామ్ హోతా. |
| Kannada | ನನಗೆ ಬ್ಯಾಂಕಿನಲ್ಲಿ ಸ್ವಲ್ಪ ಕೆಲಸ ಇತ್ತು.<br>ననగె బ్యాంకినల్లి స్వల్ప కెలస ఇట్టు. | ಏಕೆಂದರೆ ನನಗೆ ಸ್ವಲ್ಪ ತುರ್ತು ಕೆಲಸ ಇತ್ತು.<br>ఏకెందరె ననగె స్వల్ప తుర్తు కెలస ఇట్టు. |
| Oriya | ମୋର ବ୍ୟାଙ୍କରେ କିଛି କାମ ଥିଲା।<br>మోరా బాంక్రె కిచ్చి కామ్ థిలా. | କାରଣ ମୋର ଜରୁରୀ କାମ ଥିଲା।<br>కారణ్ మోరా జరూరే కామా థిలా. |
| Gujarati | મારે બેંકમાં થોડું કામ હતું.<br>కారణా కె మారె తోడున్ అగాత్యనున్ కామాహ తున్. | કારણ કે મારે થોડું અગત્યનું કામ હતું.<br>హున్ దూరత్తె తమానె ఒళాఖీ నా షక్యో. |
| Assamese | মোৰ বেংকত কিছু কাম আছে ।<br>ముర్ బ్యాంకోట్ కిసు కామ్ అసె. | কিয়নো মোৰ কিছু জৰুৰী কাম আছে ।<br>కియోను ముర్ కిసు జరూరి కామ్ అసె. |
| Malayalam | എനിക്ക് ബാങ്കിൽ ഒരാവശ്യമുണ്ടായിരുന്നു.<br>ఎనిక్కు బాంకిల్ ఒరవస్యముండాయిరున్ను. | എനിക്കൊരത്യാവശ്യമുണ്ടായിരുന്നു.<br>ఎనిక్కొరత్యావస్యముండాయిరున్ను. |
| Santali | [illegible]<br>బెంకరె ఇన్జాగ్ టినాగ్ గన్ కామి టహెన్ కానా. | [illegible]<br>ఖాతిర్ డో ఇన్జాగ్ టినాగ్ గన్ జారుల్ కామి తహెన్ కానా. |
| Sanskrit | वित्तकोषे मम किमपि महत्त्वपूर्णं कार्यम् आसीत्।<br>విట్టకోషె మమ కిమాపి మహాత్వ పూర్ణం కార్యాం ఆసీత్. | यत: मम किमपि महत्त्वपूर्णं कार्यं विद्यते।<br>యతః మమ కిమాపి మహాత్వ పూర్ణం ఖాయమ్ విద్యతే. |

# మెరిసేవన్నీ....

మనదేశాన్ని ధీమంతులూ, వివేకసంపన్నులూ అయిన గొప్ప రాజులు ఎందరో పరిపాలించారు. కానీ, పరిపాలించిన వారందరూ అలాంటి తెలివి తేటలు కలవారని చెప్పలేము. అయితే, రాజులూ, రాణులూ అందరినీ కూడా ధగద్ధగాయమానంగా మెరిసేలా చేశాయి వాళ్ళు ధరించిన వజ్ర వైడూర్యాలు పొదిగిన స్వర్ణ ఆభరణాలు!



ఈ ఆభరణాల రక్షణకు రాజులు చేపట్టవలసిన చర్యలనూ, అమలు చేయవలసిన నియమ నిబంధనలను గురించి క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందిన చాణక్యుడు తన అర్థశాస్త్రంలో వివరించాడు. ప్రతి పాలకుడూ తన రాజ్యంలో ఎక్కడెక్కడ ఖనిజసంపద నిక్షిప్తమై ఉన్నదీ తెలుసుకుని ఉండాలనీ, తవ్వి వెలికి తీసిన ఖనిజాల మీద సంపూర్ణ నియంత్రణ ఉండాలనీ చాణక్యుడు చెప్పాడు. రాజులు వాటిని చక్కగా మనసులో నిలుపుకుని, తమ రాజ్యంలోని గనుల్లో లభించే మణులూ, మాణిక్యాలూ, వజ్ర వైడూర్యాలూ తమ ఖజానా చేరడానికి తగు జాగ్రత్తలు తీసుకుని కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశారు!



# అస్సాం ప్రాంత సత్రియా నాట్యం!

నాట్యం గురించి మాట్లాడేప్పుడు మామూలుగా భరత నాట్యం, ఒడిస్సీ, కూచిపూడి, కథకళి మొదలైన నాట్యరీతులే గుర్తుకు వస్తాయి. ఇప్పుడు అస్సాం ప్రాంతానికి చెందిన సత్రియా నాట్యాన్ని కూడా ఈ జాబితాలోకి చేర్చుకోవాలి. దీనిని 15వ శతాబ్దానికి చెందిన శంకరదేవుడనే వైష్ణవాచార్యుడు రూపొందించాడు. ప్రారంభకాలంలో దీనిని పురుషులు మాత్రమే ప్రదర్శించేవారు. ఆ తరవాత స్త్రీలు కూడా ప్రదర్శనలివ్వడం ప్రారంభించారు. కథకళిలాగే ఈ నాట్యం దృశ్యాలుగా విభజించబడకుండా 'సూత్రధారి' వ్యాఖ్యానంతో నృత్యకళానాటకశైలిలో ఏకధాటిగా సాగుతుంది!

# మన నేతలు



భారతదేశానికి 1947 ఆగస్ట్ 15న స్వాతంత్ర్యం సిద్ధించింది. నూతన ప్రభుత్వ ప్రమాణ స్వీకారం న్యూఢిల్లీలోని ప్రస్తుత రాష్ట్రపతి భవన్‌లోని సెంట్రల్ హాల్ (దర్బార్ హాల్)లో జరిగింది.

ఇక్కడ చూపిస్తున్న ప్రముఖులలో కొందరికి 1947 ఆగస్టు 15తోనూ 1947లో ఏర్పడిన మొదటి ప్రభుత్వంతోనూ ఏదో ఒకరకమైన సంబంధం ఉంది. కింద ఇచ్చిన ఆధారాలతో వీరిని గుర్తించగలరా?



1. నేను భారత రాజ్యాంగపితను. నేను తొలి కేంద్ర న్యాయమంత్రిగా ఉన్నాను. మాది మహారాష్ట్ర జిల్లా.

______________________



2. నేను మొట్టమొదటి భారతీయ ఉప ప్రధానిని. చాలామంది సర్దార్ అని పిలుస్తుంటారు.

______________________



3. నేను తొలి ఉపరాష్ట్రపతిని. నా జన్మదినాన్ని ఉపాధ్యాయ దినంగా జరుపుతుంటారు.

______________________



4. నేను స్వతంత్ర భారత్ ప్రథమ, చివరి గవర్నర్ జనరల్‌ని. నాకు ప్రజాదరణ ఉందని రాజాజీ చెప్పారు.

______________________



5. నేను కాంగ్రెస్ అధ్యక్షుడిని. తర్వాత నన్ను విద్యామంత్రిగా నియమించారు.

______________________



6. తొలి కేంద్ర ప్రభుత్వంలో నేను ఆహార, వ్యవసాయ మంత్రిని. తర్వాత భారత తొలి రాష్ట్రపతిని.

______________________

విదూషకుడు

## బీర్బల్

# చక్రవర్తి, ఒంటె



1. అక్బర్ చక్రవర్తి కులాసాగా ఉన్నాడు. బీర్బల్‌తో చెప్పాడు. 'ఈరోజెంతో సంతోషంగా ఉన్నాను. ఏదైనా కోరుకో. తప్పక ఇస్తాను.'



2. బీర్బల్ వెంటనే అన్నాడు. 'ఒక ఎకరం నేల ఇప్పిస్తారా జహాపనా?' అక్బర్ వెంటనే 'ఒక ఎకరా మాత్రమేనా? పదెకరాలు తీసుకో' అన్నాడు.



3. మర్నాడు బీర్బల్ చక్రవర్తికి గుర్తు చేశాడు. 'ప్రభూ, ఆ పదెకరాలూ ఇవ్వాళే ఇస్తారా?' ఈరోజు కుదరదు బీర్బల్ అన్నాడు చక్రవర్తి.



4. ఆనాటినుంచి బీర్బల్ ప్రతిరోజూ తన బహుమతి గురించి చక్రవర్తికి గుర్తు చేస్తూ వచ్చాడు.



5. ఒక రోజు, అక్బర్, బీర్బల్ ఇద్దరూ వాహ్యాళికి వెళ్ళారు. దారిలో ఒక ఒంటెను వారు చూశారు.



6. అక్బర్ బీర్బల్ వైపు చూశాడు. 'ఒంటె మెడ ఎందుకలా వంగిపోయి ఉందో చెప్పగలవా?'



7. 'ఒంటె ఎవరికో బహుమతిని ఇస్తానని బాస చేసి ఉంటుంది. దాన్ని గుర్తు చేసుకుంటూ అది దాని తలను కదిలిస్తూ ఉండవచ్చు' అన్నాడు బీర్బల్.



8. బీర్బల్ చెప్పాడు. 'పదే పదే జ్ఞప్తి చేసుకోవడం, తలను అనేక సార్లు అటూ ఇటూ కదల్చడం వల్ల దాని మెడ కుంగిపోయి ఉండవచ్చు.'



9. మరుసటి దినం కోర్టులో చక్రవర్తి ప్రకటించాడు. 'బీర్బల్, వాగ్దానం చేసినట్టుగా నీకు ఈ రోజే పదెకరాల భూమి దక్కుతుంది.'

*మే'11 సుడోకు పజిల్‌కి సరైన సమాధానం ఇక్కడ చూడండి.*

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 9 | 4 | 8 | 7 | 5 | 1 | 3 | 2 |
| 2 | 5 | 3 | 1 | 9 | 4 | 6 | 8 | 7 |
| 1 | 8 | 7 | 3 | 2 | 6 | 9 | 5 | 4 |
| 7 | 6 | 9 | 5 | 8 | 1 | 4 | 2 | 3 |
| 3 | 4 | 2 | 9 | 6 | 7 | 5 | 1 | 8 |
| 8 | 1 | 5 | 4 | 3 | 2 | 7 | 6 | 9 |
| 5 | 2 | 1 | 7 | 4 | 8 | 3 | 9 | 6 |
| 4 | 3 | 8 | 6 | 5 | 9 | 2 | 7 | 1 |
| 9 | 7 | 6 | 2 | 1 | 3 | 8 | 4 | 5 |

## May'11 Winners

1. Vyankatesh Bhimrao Sanglikar, Kolhapur, Maharashtra- 416007.
2. K. Ramana Reddy, Anantapur(DT), A.P-515761.
3. Lopamudra Dash, Ganjam(Dist), Orissa-761018.
4. Shuchivrat Mishra, Kanpur, UP-208011.
5. M. Sridhar Prabhu, Gandhinagar, Mangalore-575003.

# నేతల చిత్రాలు

ఈ నెల మన జాతీయ నేతల చిత్రాలతో ఆల్బమ్ తయారు చేద్దాం రండి.



రాజగోపాలాచారి (రాజాజీ)



మోతీలాల్ నెహ్రూ



చంద్రశేఖర్ అజాద్



సుభాష్ చంద్రబోస్



గోపాలకృష్ణ గోఖలే



మహాత్మాగాంధీ

